# రాజ
# కళింగగంగు.

(ఆంధ్రదేశసంబంధమగు ఐదంకముల నాటకము)

ఇది

చెన్నపురిలో ఆంధ్రపరిషత్పత్రికా కార్యదర్శులగు
కొత్తపల్లి సూర్యారావుగారిచే
రచియింపఁబడినది.

మొదటికూర్పు ౧౦౦౦ ప్రతులు

ప్రకాశకులు :

వేంకటపార్వతీశ్వరకవులు,

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,

కాకినాడ.

1924

 [వెల 0—10—0]

# విజ్ఞప్తి.

నేనీపుస్తకమును 1912 సంవత్సరములో నాటకమని చెప్పఁదగని పేరువెట్టి నలువురు నాచిన్నిసోదరులవలెనె రచించితిని. అందఱకంటె నేనిందేమియు లోపముచేయలేదు. నాముద్దుసోదరుల గ్రంథములలో నెన్ని వెజ్జులున్నవో యన్నియు నిందు నేను జూపఁగలను. పరిశీలించువారి కెక్కుడుగానే తోఁపవచ్చును. ఇదియేమని యెవ్వరైన నడిగిన నదియేమని నాసోదరుల పుస్తకములలోనుండి చూపఁగలనను ధైర్యముగలుగుటచేతనే యీగ్రంథమును ప్రకటనముచేయ యత్నించుట—నలువురతో నే పనిచేసినను గ్రమ్ముకొనిపోవును. వీరబలుఁడు నామద్దెల యొంటిగా మ్రోఁగదని చెప్పినది జగద్విదితము—ఈదినములలో నాటకమని తెరమరుఁగున నాడినఁ జాలును. నవ్వరావలయును, పాటలు పాడవలయును. ఇంతియకాని గుణమక్కఱలేదని నేననుట సాహసముకాఁగూడదు. నవ్వుట, తెరలలో నిలుచుట, కవిపని కాదు. నాటకుల పని. వారునవ్వించిన నవ్వవలయును గాని కవినవ్వింపలేఁడు. ప్రేక్షకులు నవ్వుట కనేకమార్గములు నాపుస్తకమున, సోదరుల పుస్తకములఁగూడ నుండును. రసికులు పరీక్షింతురు.

ఇందలిదోషములు నావికాని మఱియెవ్వరివినిగావు. ప్రూఫులు నేను జూడలేను. దూరదేశమున నుండుటచేఁ దప్పులుపడినవని నాతప్పుల నితరులపైమోపను నాతప్పులు నితరులతప్పులు నార్యులెఱుఁగుదురు. నేను జక్కఁగ వ్రాసిన వారును జక్కఁగానే ముద్రింతురు—శుద్ధపత్రిక యెన్నఁడు నాబోటివారు తమంతఁదాము వేయలేరు. ఎవ్వరో చూపినఁగాని—ఇవియన్నియు నాకనుభవములో నున్నవి. నాశక్తి యింతేకాని స్వతంత్రించి యింతకంటె మేలుగాఁ జేయలేను. వట్టికుండలోఁ బాలెన్నఁటికిని బొంగనేరవు. పండితులు క్షమింపవలయును.

నన్ను నాసామర్థ్యమును దెలిసికొనఁగోరియో నేననినమాటల నాచిన్ని సోదరుల గ్రంథములలోకంటెఁ దక్కువున్న వేమోయని చూచుటకో యీగ్రంథము నాదరించెదరు గాక యని లోకమును గొని యూడుచున్నాఁడను.

చిత్తగింపవలయును.

విధేయుఁడు,

కొత్తపల్లి సూర్యారావు.

శ్రీమదుమారమణాయనమః

# కళింగగంగు.

## ప్రథమాంకము.

శా. ఏపూర్ణాత్ముఁడు సర్వశక్తియుతుఁడై బృందారకారాధ్యుఁడై
దీపించున్ బుధశాపమొందుఁ గొనునిస్త్రైజత్వమున్ భైక్షమున్
బాపంబుల్ద్రోలఁగింపఁదాల్చు బహురూపంబుల్ క్రియాశూన్యుఁడౌ
నాపంచాస్యుని లీల లేలు మిము నిత్యానందసంధాత్రులై.

(నాంద్యంతమున సూత్రధారుఁడు)

ఉ. భార్యకుభర్తకుం గలుగు బాంధవమేహరునందుభక్తునం
దార్యులుసెప్పఁగా నది యథార్థము సేయఁగ దక్షనాటికా
చార్యటనావిలాసుఁడగు నంగజవైరియుమాధినాథుఁ డా
చార్యుఁడునైన లోకపిత సర్వసుఖంబులు మీకొసంగుతన్

(తనలో) కాలానుగుణంబుగఁ గ్రొత్తనాటకముం బ్రదర్శింపఁబోవు నేను బూర్వసాంప్రదాయానుసారము నటిం బిలుచుచున్నాఁడను. (ప్రకాశ) ప్రియురాల! ఇటురమ్ము. (తనలో) "అలంకరించుకొనుటయైనచో నిటురమ్ము" అనక కొంత క్రొత్తమార్గమునే త్రొక్కితిని.

నటి—(తనలో) స్త్రీస్వాతంత్ర్యమునకై పాటుపడు నేను మగఁడు పిలిచినంతనే పూర్వకాలాంగనలవలెఁ బిల్లిరీతిగ నెదురువెళ్ళుచున్నదానను. నేనీయనకు నమస్కరింపక స్వతంత్రముగా నిలువంబడియెదను. (సమీపించును.)

సూత్ర—ప్రియురాల! వింటివిగద.

నటి—వింటిని; మీకీవెఱ్ఱియేమి?

సూత్ర—ఆవెఱ్ఱిని నీవు నాకే యారోపించుచున్నదానవా!

నటి—నాపైఁ బెట్టుకొందునా

సూత్రి—అది యేరీతియో? కొంచెము వినియెదను.

నటి—వెఱ్ఱివానికి లోకమంతయు వెఱ్ఱిగానుండినట్లగపడును. ఆఁకలిగొనిన చేఁపవలె గాలమునకుఁ దగుల్కొనుట యొక్కతనైనఁ గలదా.

సూత్రి—సభవారి యాదేశమును నిరాకరింపుచు. చున్నదానవు.

నటి—చల్లఁగాఁ దప్పుకొనవలసినదియే.

సూత్రి—సభ్యులలోపమా, మనలోపమా?

నటి—లోపము కాలముదిగాని యితరులది కాదు.

సూత్రి—కాలమునందలి భేదములు కొన్ని కనఁబడు చున్నవి లే.

మ. ధనలోభంబున విత్తవంతునికడన్ దాస్యంబొనర్పంగ స
జ్జనుకర్మంబది యేరిలోపమనుకో సందింతయున్ లేదు వా
రని జేపట్టితిమంచు దుర్ధనులు గర్వింపన్; దురాశాహతుల్
ఘనసుజ్ఞానముపోయి సజ్జనులు మూర్ఖశ్రేణిగాన్ స్రగ్గగున్.

నటి—మఱియుఁ గాలమును బట్టి.

సీ. పూర్వనాటకమన్నఁ బోనిమ్ము పలుమఱు
వినినదే విన మాకు విసుఁగఁటండ్రు
క్రొత్తనాటకమన్నఁ గ్రొత్తక్రొత్తయె కథా
సందర్భములఁజూడఁ జాలమందు
రిది విదేశపుఁగథ హృద్యమ్మటన్నచో
నేకకాథభాష యింపఁటండ్రు
భాషాంతరమునందె పచరింతుమన్నచో
జాతీయములు మీకు సాగవండ్రు
మీరుపాడినదానికి మేము వినిన

దాసికిని జెల్లు పెట్టుఁడీ తంబురాల
నిచటఁ దలయూఁపితిమిగాన నీరలనెడు
దారిలోనికి వచ్చి రిత్తఱేని బ్రజలు.

సూత్రి—ఏమి నీప్రపంచానుభవము? ప్రజయంతయు నట్లుండునా? నీవు బ్రమయుటకుఁ గారణము లేకపోలేదు.

సీ. వర్ణసమామ్నాయ ఫణితిగుర్తెఱుఁగక
తరతత్త్వమును జెప్పసాహసించు
శబ్దార్థరీతుల సందర్భమెఱుఁగఁ డ
పర పాణినిఖ్యాతి వడయఁజూచు
నుచ్చరించినమాట లోఁగి వ్రాయనేరఁ డ
ఖిలశాస్త్రగతులు లిఖింపఁదొడఁగు
పదవాక్యవృత్తి విభాగం బెఱుంగఁ డ
త్యుత్తమకవి యశం బొందఁగోరు
నన్నిటందనపేరుపై యాడఁ జూచు
నన్నిటను జ్ఞానమా నిండుసున్న యట్టి
వారు వెలసిరి వారిదర్పములు గాంచి
బ్రమసితివి నీవు ప్రజనెల్ల సమముగాఁగ.

నటి—ఏమో యిక్కాలమున మెఱమెచ్చుల వారే యెక్కుడుగానుండవచ్చును. చూచితివిగదా మొన్న.

సూత్రి—అది దోషపుమాట; నిప్పక్షపాతబుద్ధులు భగవద్భక్తులు పెక్కురుగలరు.

నటి—సరి, యట్లేయనుఁడు—మన కేనాటకమున కాజ్ఞాపించిరి?

సూత్రి—వేములవాడ భీమకవి ప్రభావమును దిగంతవ్యాప్తము గావించిన రాజకళింగగంగు చరిత్రమునను.

నటి—భీమకవి రండాపుత్త్రుఁడని—అక్కాలమునఁ గళింగగం

గను రాజే లేఁడని—సజ్జనగరమునకల్పితపట్టణమని—ఏమేమో యిది వఱకే నిర్ధారణచేసిరే! ఈకథ నెట్లునమ్ముదురు.

సూత్రి—కథయందు విశ్వాసములేనివారు భీమకవి రండాపుత్రుఁడని యెట్లువిశ్వసించిరి? ప్రత్యక్షప్రమాణ మెక్కడ?

నటి—వారికి నచ్చినదానికి బ్రమాణమక్కఱలేదు.

సూత్రి—తమకునచ్చనిది ప్రత్యక్షమైనను నసత్యమేనా! కల్పితమెట్లో రుజువుచేయవలదా. కల్పితమన్నంతనె సమాధానమెట్లగును?

మ. పొగబండ్లేగతిఁ బోవుఁ; దీఁగెలపయిం బోవంగ వార్త లె
ట్టుగనో! యంచనిప్రశ్న పుట్టఁగ నెయుండున్ యంత్రముల్ మేల్మరల్
పొగయు న్నీరును సాధనంబులని చెప్పన్ లోక; మానా ననున్
జగ; మామాటకె సందియంబుడిగెనే. జంత్రంబు సామాన్యమే.

నటి—మీరు విమర్శకులుగారు—కాలక్రమమున నే శాసనమో యేగ్రంథమో సంశయచ్ఛేదముం గావించును గాని బహుభావములు గల యీసభవారినెట్లు రంజిల్లఁజేయుదురో యాలోచింపుఁడు.

సూత్రి—నేనామార్గమును మొదటనే కనిపెట్టితిని.

నటి—ఆమార్గమే మార్గము.

సూత్రి—ఏమార్గము కల్పితమనువారి కిష్టమో, యేదిజరగినదనువారికి సమ్మతమో యది.

నటి—అట్లయిన నన్నేమిచేయుమందురు?

సూత్రి—వెనుదీయక నేను దాల్పుమనిన వేషములన్నియుఁ దాల్పవలయునని కోరుదును.

నటి—వెనుదీయ రాదుగాని—

సూత్రి—కాని యేమిటి? భీమకవి తల్లివేషమునకా సందేహము! నీమతంబునసందేహముండరాదే! మగలులేనివారింగాంచిన వారు మరలఁ బతుల నంగీకరించునట్లు చేయవచ్చునని సంతసింతువే—యిపుడేమైనది. మఱియు నే నెదుటనుందును.

నటి—(తలవాంచి) ఈమెప్పునర్వివాహముచేసికొనినచో నీనింద లేకుండి యుండునుగదా.

సూత్రి—బలె. మంచియూహా! నీవంటిలోకోపకారిణులవల న మేలునకుఁ బ్రతిగాఁ గీడు కలుగును.

నటి—అది యెట్లు.

సూత్రి—మామతానుసారముగ మగువకు వైధవ్యము సంభ వింపనే సంభవింపదు. దైవవశమున సంభవించెనా యొక్కమాటే. మీామతానుసారముగనైన నొక్కరూఁడు, ఇనుమాఁడు, మువ్వురు, ఎక్కడికి వారియోపిక.

నటి—(సిగ్గుతో) నామనస్సు కలఁతవడినది. నాకీపూఁట—ప ని చెప్పవలదు.

సూత్రి—స్వభావాభినయము చేయ లేనందువా? అట్లయిన మ నోవికలతఁజెందియున్న కళింగగంగుభార్య వేషమును దాల్పుము.

నటి—పుట్టెఁడు దుఃఖములో నున్న నాకీనాఁటికి సెలవిండు.

సూత్రి—పుట్టెఁడు "నీ వీశబ్దము నే యర్థముఁ బ్రయోగించితి వి? ఈమాటకే దుఃఖమువచ్చిన—వారివారి గుణములు తెలిసికొన కుండఁ గనఁబడిన మగువలకెల్ల నీసంస్కారమును బోధింతువేని వారికెం త దుఃఖము పుట్టునో.

నటి—నాథా! మీారనినమాటకుఁ గోపము వచ్చుచున్నది.

సూత్రి—"శేషం కోపేన పూరయే" త్తని యుక్తినిలువనినాఁడు చేయునది యింతయే—నీవధికారివైనచో నేనుద్యోగినైనచో నాయు ద్యోగ మూడఁదీసియుందువు—

నటి—(ఆలోచించి) నాయుక్తి నిలుచునో నిలువదో, తేపు చె ప్పెదను; గాని, యిపుడు నేనేమి చేయవలయును.

సూత్రి—గాన మారంభింపుము.

నటి——మంచిది. బ్రాహ్మణునకు సదస్యముపక్లైమువలె నాకి ది ప్రతిప్రదర్శనమునకుఁ జిక్కుగానేయున్నది. కానింక——

మ. విశదాకాశమునఁ, జనాఘములు పృథ్వీజాని హూయింపఁగా
సశరీరంబుగ దర్శనంబొసఁగు నాస్వర్గంగనా; సత్కవీం
ద్రశతార్ఘ్యర్పిత గంగదానజలధారాబింబముంబోలి; యౌరా
ర! శరద్వేళలఁదోఁచెఁ గృష్ణపశుమార్గం బౌత్తగోలోకమై.

సూత్ర——బళిర బళిర! మనస్సు కలతపడియున్నను గానము నందుఁ గ్రొత్తకల్పనమే కావించితివి.

(తెరలో)

ఉ. ఎవ్వతెవే పిశాచిసిరో! యెల్కకుఁ బ్రాణము పోవుచుండఁగాఁ
గ్రొవ్వినపిల్లి గంతిడుటకు న్సరివచ్చెను నీప్రలాపముల్
మవ్వపుఁగీర్తికై బ్రిదుకుమాట దలంపనివాని బోరనఁ
గెవ్వనఁగేరి మెచ్చెద వక్రమమార్గమొ హాస్యరీతియో.

నటి——(బెదరుచు) నాథా నేనేమంటిని? యెవ్వరో నిందిం చుచున్నారు.

సూత్ర——ఆమె కళింగగంగునృపాలుని భార్య. తన పెనిమిటి చేత నెడలెఱుంగని దానముకై పొగడుచున్న దాన వనుకొన్నది. సరి! యేమైననేమి! రమ్ము——మన మనంతరకార్యమునకై గడంగవల యును—— (నిష్క్రమింతురు.)

(ప్రవేశము——రాణి——సేవకురాలు)

రాణి——కమలా! రాజులకు దానగుణము మదగజములకువలె స్వాభావికము. మీాప్రభువుగారు చేయునది యకార్యము కాకున్నను బూర్వాపరములాలోచించుచున్నారా లేదాయని మనస్సు నొగులు చున్నదిచుమీా.

కమ—అమ్మా! నిజమే. "పిల్లుగట్టు నలకుచేరుంను తానయ్యు నాయమునకు వెచ్చమధికమైన" ననికలను (వినకకజ్ఞాతో విస రుచున్నది.)

రాణి—ఓసి! మనలో మనమాట—

కమ—అల్లే—ఇందెవ్వరును బరులు లేరు.

రాణి—(చెక్కునఁ జేయిచేర్చి యాలోచించును.)

రాజు—(ప్రవేశించి—తనలో) ఈముగుదయెంతయనుచు యిం చినను దేఱకున్నది. (చాటునవిలిచి)

క. అడిగినవారలకిచ్చుట
యుడుగుదునో యడుగకున్న నొసఁగుదునో నా
యొడమికి ఫలమెది యెన్నఁడు
నుడుగనియీవంత దేవినుడుకుంబెట్టున్

రాణి—ఆయముకంటె వ్యయమధికము చేయుచున్నారా

కమ—జ్ఞానధనుఁడగు ప్రభువు. ఏమిచెప్పఁగలము అనవరత వితరణముచే మనకు స్థూలదృష్టినట్లు కనఁబడుచుండవచ్చును. (వినరుచున్నది.)

రాజు—మనస్తాపమునకుఁ గమల చెప్పుఁవాక్యములు గొంత యుపశాంతింగలిగింపవచ్చును.

రాణి—అల్లేని నాకనూయ యేమిటికి?

కమ—(ముంగురులు చక్కనొత్తుచు) ప్రభువుత్మేనుము గోరు టయ కాని యిది యసూయకాదు.

రాజు—బలే! బలే! కమలా!

గీ. పతిహిత ప్రార్థినులు ప్రాణసతులగుటయు
సతులమతినొప్పి వాపెడు మతి మదగ్ర
ణులు పరిజనంబులగుటయు బహుయుగములఁ
బతిరొనర్చిన సుకృతంపు ఫలముగాదె.

రాణి—అపాత్రత్యాగము జరుగుచున్నదా?

రాజు—ఇన్నివిధముల నీవు పరీక్షించుచుండ నే నపాత్రత్యాగ మెట్లుచేయఁగలను.

కమ—విద్వత్ప్రభువు—పండితులకొసఁగును—

రాణి—నిరుపేదలకిచ్చినదియుఁ బాత్రమే.

కమ—ప్రభు వీయిరుదెగలవారికే యిచ్చును. ఇది నే నెఱుఁగుదు.

రాజు—నీవెకాదు సమస్త జను లెఱుఁగుదురు.

రాణి—నిరుపేదలు దుఃఖింతురా? మనకు దుఃఖము—పండితులు కోపింతురా మనకుఁ గష్టము.

కమ—మా యేలిక సమయజ్ఞుఁడు.

రాణి—సమయజ్ఞున కేని కష్టకాలము ప్రాప్తించెనా సర్వము మఱపువచ్చును.

రాజు—ఏమిటి కీమె యింతవిచారమునకుఁ దొడఁగినది? దుస్స్వప్నఫలమా? ఆగతజ్ఞానమా—

ఉ. ఒక్కపుడేదియో మదికి నొప్పమివాటిలునట్లు తోఁచు; నా
ప్రక్కనె కాచియున్నటులు గ్రక్కున వచ్చిపడు న్విచారముల్
దిక్కఁగనీయరాదెపుడుఁ జింతల కింతయుఁ దావులోనఁ జే
రెక్కినవారె లోఁగుదురు నింతులు దానికి నొక్క లెక్కయే!

రాణి—నాకీ యసమయవిచార మేల కలుగవలయును.

కమ—అసమయమా—ముందుజాగ్రత్త. వచ్చిన పిమ్మట తొట్రుపడుట యజ్ఞానము.

రాజు—నీకీ యసమయవిచారము నేను దలఁచినట్లేదో యొక యలజడివలనఁ గలిగినది.

కమ—అమ్మా—మనసు చిక్కఁబట్టుము—విచారములన్నియుఁ దొలఁగును.

రాణి—నామనస్సు నాకుఁ జిక్కకయేకదా నీతో నాలోచనము—

రాజు—ఈమె కలఁతవాపుటకు నాకిదియే సమయము—(సకిలించును)

కమ—(ఉలికిపడి) ప్రభువుగారువలెఁ దోఁచుచున్నది.

రాణి—(అచ్చెరువుతో) మన మాటలు వినియుండునా—

కమ—ఏమితప్పుమాటలాడితిమి. నీవుధైర్యము వహింపుము.

రాజు—(ప్రవేశించును)

రాణి—(లేచి నమస్కరించును.)

కమ—(పీఠము పెట్టుచున్నది.)

రాజు—(కూర్చుండి) ఆనందమేకద !

రాణి—(కూర్చుండి) మీరాకవలన.

రాజు—మీసల్లాపమున కడ్డుకలిగినదా ?

రాణి—సల్లాపములకేమి లెండు.

రాజు—అట్లనెదవేమి ?

మ. పరమప్రీతము లోకమెల్లను బరప్రాబల్యమా లేదు; బం
ధురసస్యాఢ్యము భూమి; పాలనము నిర్దుష్టంబుగా లోకమె
ల్లరు శ్లాఘింతురనామయంబు లొడళుల్సల్లాపముల్గాక మీ
కరయన్ వేఱొకరీతి కేమి కతమో యబ్జాక్షి యోజింపుమా.

(నిరీక్షించి) నీవొకింత ముఖ విశాసము తగ్గియున్న దానవు.

గీ. చింతకెడమేది యెవ్వరిచేతనైన
నప్రియము వింటివో హృదయంబు కలఁగఁ
గల గసన్లేదుగద యడుగంగఁ దగదె
కోపకారణమైతినొకో యిదేల !

రాణి—శ్రీహరీ! ఈయుపచారముకూడనా! ఇదియేచాలును.

రాజు—కూడదననిన? ఏది నీకుఁజాలును?

రాణి—ఏమియును లేదు.

రాజు—లేకయేమి! నీమాట సందిగ్ధముగానున్నది.

రాణి—మాటలాడుట చేఁతఁ గాక; సందిగ్ధముగాఁ బలుకుట

రాజు—వింతలుపుట్టుచున్నవిగదా.

గీ. బాల్యమున మందమతులున్నఁ బ్రౌఢులగుదు
రెదిగినకొలంది; బాల్యముమొదలుఁ బ్రౌఢు
లెదిగి మందులుగామాఱు టెఱుఁగ నింత
దనుక; మాటాడఁజేఁతగా దనిన నగరె.

రాణి—నవ్వటాలకే యట్లంటిని.

రాజు—ఇట్టి చమత్కారవాక్యములు మాటలాడఁ జేఁతగాని నోట వెడలిన వేగదా?

రాణి—ఘుణాక్షరన్యాయమున వెడలుచుండుట కలదు.

రాజు—మాటాడఁజేఁతగానివారేకదా న్యాయముల నెఱుఁగుట!

రాణి—సహవాసబలమున, వినికిచేఁ గొన్ని పెద్దపెద్దమాటలు నోట వెలువడుచుండును.

రాజు—ఇట్టి చేఁతగానిమాటలు నేర్చుకొనుటకుఁ దగినసహవాసము వినికి యెల్లవారికి నొదవుగాక.

రాణి—ఒదవవి కావుననే లోకమునిరాలోచనముగనున్నది.

రాజు—ఆ లోకములోనిదానవు నీకేలయాలోచనము.

రాణి—నాథా! ఇట్టివియేగదా చేఁతఁగానిమాటలు!

రాజు—చాలుఁజాలు-ఇట్టివెఱ్ఱులు కట్టిపెట్టుము. తలఁపునకు వచ్చినవానికెల్లఁ దలగట్టి విచారింతురా ?

రాణి—వెఱ్ఱులందఱును గట్టిపెట్టవలసినదేగదా!

రాజు—ఏమి? నాయొద్దఁగూడఁ గొంత వెఱ్ఱికనఁబడుచున్నదా?

గీ. చూడఁజూడంగ గుఱ్ఱము గాడిదయగుఁ
దినఁగదినఁగను గారెలు కనరుజెందు
నట్లుసద్గోష్ఠి నెంతయో యంబియంది
యిపుడు నే వెఱ్ఱిగొంటినే యిందువదన.

రాణి—సద్గోష్ఠి వెఱ్ఱియే మీకుఁ గొంత పట్టుకొన్నది.

రాజు—క్రొత్త నీతిశాస్త్ర మెవ్వరయిన రచియించినారా?

రాణి—ఏవిషయమున?

రాజు—సద్గోష్ఠి వెఱ్ఱియనియు—దానిని దిగవిడువవలయుననియుఁ దెల్పువిషయమున.

రాణి—క్రొత్తశాస్త్రము పుట్టలేదుగాని ప్రాఁతవానియందే యేదియు నతికూడదని యున్నది. "అతిసర్వత్ర—"ఆముక్కలు నాకు రావు. ఎవ్వరో చెప్పుకొనుచుండ వింటిని.

రాజు—నీశ్రుతపాండిత్యము లోకాతీతముగానున్నది. చెప్పుడుమాటలు చెడ్డవియని యెవ్వరైనఁ జెప్పుకొనుట వినలేదా.

రాణి—చెడ్డమాటకుఁ జెవియిమ్మని యింతవరకెవ్వరును జెప్పలేదు.

రాజు—హాయిగానున్నపుడు విచారింపుమని చెప్పినారా?

రాణి—లేదుగాని, యెవ్వరో-అతిమాత్రము కూడదని చెవులు చిల్లులు వోవునట్లు చెప్పుచున్నారు.

రాజు—నాలోనున్న యతిమాత్రగుణమును దెల్పితివా సామాన్యమునకు దింపయత్నించెదను.

రాణి—అది యందఱ కన్నిరీతులనుండును. మీది మీ కతిగాఁ గనఁబడకపోవచ్చును.

రాజు—నీవు చెప్పినట్లు చేసెదను నిరూపింపుము.

రాణి—నేనంతటిదాననా-వారివారికిఁ దెలియవలసినదేగాని-

రాజు—రాజన్నంతనె పండితులు వత్తురు, పామరులువత్తురు—వారి వారికిఁ దగినట్లేయనిచో—

రాణి—(కమలకు మనమాటలు వినినట్లేయున్నదని సంజ్ఞ చేయును)

కమ—(తెలిసికొనినట్లేయున్నదని బెదరుచుఁ బ్రతిసంజ్ఞ చేయును)

రాజు—ఎట్లుజరుగవలసినది యట్లుజరుగకమానదు. దైవయత్నముగాని మనస్వాతంత్ర్యమిందుఁ గొంచెమైనను లేదు-

రాణి—పురుషప్రయత్నము కొంతయున్నదిగదా! మనజాగ్రత్తలో మనముండవలయును.

రాజు—అదియే నీవెఱ్ఱి; అందు మనస్వాతంత్ర్యము కొంచెమైననున్నపుడుగదా మనజాగ్రత్త!

రాణి—ఏదియెట్లున్నను గవీశ్వరులవిషయమున జాగ్రత్తగానుండవలయునని ప్రార్థించెదను.

రాజు—తిట్టుకవులు బట్టుకవులు, నుందురని యెవ్వరో పిఱికి మందు పోసియుందురు.

రాణి—బట్టుకవులకు నేను భయపడను.

రాజు—తిట్టుకవులు వేఱుగా నున్నారా ?

రాణి—లోకము చెప్పుకొనుచున్నది.

రాజు—అప్పుడైన నెట్లు జరుగవలయునో యట్లే జరుగును. మనకు భయమేల?

రాణి—జాగ్రత్తగానుండుమని ప్రార్థించెదను.

రాజు—

క. ఉందురు కొందఱు సౌమ్యులు
గొందఱు దుందుడుకువారు కుకవులు సుకవుల్

పొందుపడ మాటలాడిన
నందఱుదుందుడుకుఁ దీఱు నటుభయమేలా?

రాణి—పొందుపడ మాటలాడిన నాకుంజాలును.

రాజు—కానిమ్మిపుడా విచార మేల ?

రాణి—ఓకవీశ్వరులార; నన్నెట్లు కాపాడెదరో;

రాజు—కవీశ్వరులపై వాఁడు సర్వేశ్వరుఁడుగలఁడు.

రాణి—ఓసర్వేశ్వరా! మమ్ముఁరక్షింపుము.

కమ—దేవీ! ఇంక దైవముపై భారమువైచియుండుము.

రాణి—ప్రాణేశ్వరా! దాతృత్వమున మీకు రాత్రిందివములు తెలియవు. ఎప్పుడెట్టివారువత్తురో, ఏసమయమెట్లుండునో!

రాజు—

మ. ధనమర్థించి కవీశ్వరుల్వలువు రాస్థానంబు సొత్తెంచి యి
చ్చినఁ గైకొందురు; లేదనన్వెడలుదుర్ చీ కొట్టుటల్ తిట్టుటల్
ఘనమంచెంచినవారిఁజూచినపుడే కానిందు మీ రెప్పుడేఁ
జనుదెండన్న తలంపు బాత కొదవున్ సన్మార్గుఁ బూజించెదున్.

రాణి—తిట్టుకవులను మీరుబూజింపవలయును.

రాజు—భయపడి తిట్టువానికిఁ దిమ్ముచానికిఁ నొసంగినఁ బాత్రాపాత్రవిచారమెప్పుడు.

—(తెరలో)—

మ, తనసామర్థ్యము లోకమెన్నఁగఁ గవిత్వప్రజ్ఞఁ జూపించుచున్
ధనముంగూర్చుచు సంతసింపక వృథా దర్పంబు నన్వారునా
కెనయే వీరలు సాటియేయనుచు దుర్వ్యాప్తిన్విజృంభించుద
క్షీనపుంబండితుఁడిందు వచ్చె విని నీ కీర్తిప్రభావాదులన్.

మఱియును-

మ. సకలజ్ఞుండవు నీసమక్షమునవాక్చాతుర్యవాదాదులన్
వికలప్రజ్ఞుని జేయువాఁడనని వెన్వెంటం గళింగాంధ్రుఁడా
శుకపింఛాండలవానితో వెడలిప్రాచుర్యంబుగావించెఁబ
త్రికలన్ వీథులవెంట వారిసభకుం దేనాజ్ఞ వెట్టింపుమా.

రాజు—(విని లేచి) ఇపుడు నేనావిషయమై యోజింపవలయును దేవీ! నీవు హాయిగానుండుము.

రాణి—(చేతులుజోడించి) మహారాజా! జాగ్రత్త జాగ్రత్త!

(నిష్క్రమించుచున్నారు

—ఇది ప్రథమాంకము—

# కళింగగంగు.

## ద్వితీయాంకము

(ముగ్గురు బాలురు గిచ్చకాయలాడుచుఁ బ్రవేశింతురు.)

ఒకడు—(గోవిందుఁడు) రెండొగ్గులు నావఁటరా?

రెండవవాఁడు—(భీముఁడు) రండెవ్వరు కాదనినన్ (అని గుంట కడనుండి జేన గొలుచుచున్నాఁడు.

గోవిం—పిక్కిరియాట యిదేరా

భీము—చెక్కనఁబోడి చెడఁబోరా

మూఁడవవాఁడు—(సోముఁడు) నిన్నను నిట్టులె పోరా

భీము—ఎన్నఁడు నిట్టులె లేరా

గోవిం—ఆడుము చక్కఁగ లేదా

సోము—నీడుము మాజత వాఁడా

భీము—ఇద్దఱునొక్కరైనా రా

గోవిం—పెద్దలనడుగఁగ రారా

భీము—(జేనగొలిచి) ఒక్కాయకొక్కు;

గోవిం—రెండాయరెట్టి (జేనగొలుచును)

సోము—ఓయబ్బ; యీభీముని జేన మూరెఁడున్నదిరా,

భీము—లేదు చూడుము; నీగీతయొద్దనుండియే కొలిచితిని. ఇదిగో నాజేన.

సోము—ఆడెదు మోసపుటాటల్

భీము—ఓడినయపుడీమాటల్

గోవిం—(కూర్చుండి లేచి) ఏవీ యాడుము సరిగా. (అనిగుంట యొద్దఁ గాయ యొగ్గుచున్నాఁడు.)

భీము—ఏదీ యొడ్డుము బరిగా. (చేతిలోని రెండు కాయల నొక దానితో నొకటి కొట్టుచున్నాఁడు)

సోము—గోవిందా! మరలమనమే యొగ్గవలయునా? మనమాడవలదు.

భీము—ఓడినవా రొగ్గుట యెక్కడను లేదా?

సోము—మాయూరిలో లేదు

గోవిం—(గుంటయొద్ద నొగ్గిన కాయను దీసికొనుచున్నాఁడు)

భీము—మీయూర లేదేమో, మాయూరనున్నది.

సోము—మీ దేయూరు; మా దేయూరు?

భీము—నీదియు నాదియు నీయూరే గోవిందుని దేయూరో గాని.

గోవిం—(నవ్వుచు) మాది దాక్షారామము.

భీము—(కోపముతో) ఔను. నాది దాక్షారామమే. తప్పా! ఆయూరిలో మనుష్యులు లేరా?

సోము—గుడిలో దేవుఁడున్నాఁడు.

భీము—దేవుని నిందించు నీనోటికి బుద్ధిచెప్పకొనుము.

గోవిం—మమ్ము మోసముచేసిన నీకెవ్వరు బుద్ధిచెప్పెదగు.

భీము—తప్పుచేసినవారిని దండించుటకు గంపెఁడుకన్ను పెట్టికొని చూచుచున్న భగవంతుఁడు.

(ఒక పెద్దవాఁడు ప్రవేశించును.)

పెద్ద—ఓ బాలురారా! ఈయెండయేమి, కాలు క్రిందబెట్టినఁ జుఱ్ఱున నంటుకొనుచున్నదే; చల్లగా నాడుకొనుచున్నారా? మీకింటఁ బనులు లేవా?

భీము—ఇతఁడు దేవునిలాగున వచ్చినాఁడు

పెద్ద—మూర్ఖులార! చదువుసందెలుగుంటఁబెట్టి గంటవాయించినారా? ఓరీ, భీమా! వెధవకొడుకా! అదపుపెట్టువారు లేక పేటు రేగు నీకీయాటలేమి? తల్లిదండ్రులు తెచ్చిపెట్టుచుండ మెక్కినుక్కి యెద్దులవలెఁ దిరుగు వీరితో నీకాటలేల—నీకై మీయమ్మ యెక్కడఁ దిరుగును. కానిమ్ము; సాయంకాలము మీయమ్మతోఁ జెప్పెదను.

భీము—(భయముతో) మామా! నన్నుఁబురికొల్పి చదువుకొనుచున్న పుస్తకము లాగికొని యీసోముఁ డింటఁబడవైచి యిక్కడికిఁ దీసికొనివచ్చినాఁడు.

సోము—మాటలు నేర్చినవాఁడు గనుక మామీఁదఁ బులిమిపుచ్చుచున్నాఁడు. మా కాయలన్నియుఁ బిక్కిరిచేసి గెల్చుకొన్నాఁడు.

పెద్ద—చీ! ఎవరికాయలు వారు పుచ్చుకొని పొండు.

(అని సమాధానపఱచి పోవును)

గోవిం—(నవ్వుచు)

కం. ఒకతాయిల్లము వారిని
సకలజనులుఁగాంచి చదువుసందెలు లేవా
యకట! యీవిధవముండకొ
డుక! యని తిట్టెదరఁ ఱెప్పుడుం గనుఁగొన్నన్!

సోము—ఒకనాఁడు మానాయన—

భీము—(కోపముతో) మీరు బుద్ధిహీనులు. మీజట్టుండను. ఇంక నెన్నఁడు మీతో మాటలాడను.

గోవిం——ఆడ లేక యోడిపోయినాఁడు-దుఃఖము వచ్చి-

సోము——కాలిక్రింద మాఱిపోయినాఁడోయి;

భీమ——అగును; ఓడిపోయినాఁడను. చెప్పకొమ్ము. చెప్పి చెప్పి నా కాలికి బంగారు చెప్పులు చేయింపుము.

గోవిం——సోమా! ఒకవేళ నీపెద్దవాఁడు మనవాండ్రతోఁ జెప్పునేమో కాఁబట్టి రమ్ము; రెండవసందులోనికిఁ బోయి యాడుకొందము

(అని పోవుచున్నారు.)

భీమ——వాస్తవముగాఁ జదువు లేక చెడిపోదురుగాని తిండి లేక చెడరు. ఈదిక్కుమాలిన వేములవాఁడలోఁ జదువుకొందమన్నను జెప్పువారు లేరు. ఇందుకనియే కాఁబోలును దీనికి వేములవాఁడయని పేరు కూడఁ గొందఱు చెప్పెదరు. నేను జదువుకొనినపిదపఁగాని యీగ్రామమునకు రాను. అప్పుడు వచ్చి యీమూర్ఖులకిద్దఱకు బుద్ధి చెప్పెదను. కాలక్రమమున నాతల్లికంతయుఁ దెలియఁగలను. (అని యూరు విడిచి పోవుచున్నాఁడు.)

(ఒక బ్రాహ్మణవిధవ ప్రవేశించుచున్నది.)

విధివశము. అత్తవారింటనడుగు వెట్టి పటుమని పది కాలములపాటు గాపురముండఁ గాఁ గూలినది. ఎవ్వరి నేమందును. పుచ్చినవక్క వచ్చు సాధనము లేదు. మానుగారు మాపుగారే! పుట్టినిల్లె గతియైనది. ఎట్టులో దినములు నెట్టుచు మూలఁబడియుండనీక దుస్సహావాసముల మరగిన పుత్రుఁడు నాకొకఁడు దాఁపరించినాఁడు ఎందో పోయినాఁడు. మృతినొందిన పెనిమిటికై యేడ్తునా, కనఁబడని తనయునికై యేడ్తునా? ఓకొంటెబాలురారా! మాకుఱ్ఱవానిని మీపొట్టబెట్టుకొన్నారా! ఎందుఁబోయినాఁడో తెల్పఁగలరా! మిమ్ము దూషించినలాభమేమి! మా

# ద్వితీయాంకము.

బిడ్డ దుడుకువాఁడు—మీబిడ్డలనెత్తిపైఁ గంపలు కొట్టుకొనుండని—మన బంగారుమంచిదికాసపుడు—(చెవియొగ్గివిని) ఎవ్వరునాయనా! పిల్లవాని నక్షత్రమా! అయ్యో! అప్పుడు నాకంత తెలివియెక్కడిది! అప్పటికి నిప్పటికి నొక్కమచ్చునయున్నది. శివరాత్రికి మూఁడునెలలకుఱ్ఱవాఁడు—(విని) పేరా? భీమేశ్వరుఁడు; మీకడుపుచల్లగ—నేనంతటిదాననగుదునా పండితుఁడైనను గాకపోయినను నాకంటఁ బడినఁ జాలును—జీవించి యున్నాఁడుగదా!

ఒకఁడు—(ప్రవేశించి) తల్లీ! నీమొగముచూచిన నపుత్రకురాలివలెఁ గనఁబడవు. నీబిడ్డనికి భయములేదు—నక్షత్రము తెలిసినట్లయిన లగ్నముకట్టిపెక్కడనున్నాఁడో వలవేసిలాగిన ట్లింతలో నీయెదుటఁబెట్టుదును—నీకుఁ జదువురాదా? తండ్రిలేనిబిడ్డఁడని యపుడు జాతకము వ్రాయించియుండవు. తిథివారనక్షత్రములు వ్రాసి యేచూరులోఁబెట్టిన నుండునుగదమ్మ!

విధవ—నలువురివలెఁ జదువవచ్చిన నాకీబాధయేల—

ఒకఁడు—ఓయమ్మ! చదువురాదో బ్రతికినావో; చదువవలదు; చట్టుబండలువలదు. నీయీశ్వరభక్తియే నీకుఁజాలును—విద్యావతుల మనుగర్వముగలమదవతులను జూచుచున్నాముగదా!

ఉ. జనకుఁడాడటఁ గూతు శాస్త్రికడనిచ్చెల్ సంస్కృతాంధ్రగ్రంథంబులున్
ఘనకావ్యంబులునుం బురాణములు నుద్గ్రంథంబు లెల్లన్ సనా
తనధర్మంబులు నేర్పఁజేసెఁ దుదకాతన్వంగి యత్తింటనుం
డిన నేనన్నముముట్టఁ బుట్టినిలు నేఁడే చేరుదం జేడ్చెడున్.

విధవ—అత్తకోడరికము కత్తిమీఁదసాము; పుత్రునిపైఁగలప్రేమ యత్తకుఁ గోడలిపైయుండదు.

ఒకఁడు—చదువురాని నీవట్లుతలంపనగును. చదువుకొన్నవారి గతియేమి, ఆఁడువారికేమి, మగవారికేమి? చదువుదారిచదువుదే; జ్ఞానముదారిజ్ఞానముదే. వారియదృష్టము.

విధవ—ఎవరబ్బా! అత్తయింటనున్న నన్నుమఱినను; పుట్టినింటికి నేఁడేపోనుసనిపట్టుపట్టినవిద్యావతి-

ఒకఁడు—పేగుతోఁబనియేమి? ఇంకొకచోట-

గీ. పెండ్లిగానిమఱఁది వెడలించె నిలు పూట
కూళ్ళయింటనన్న కుడువఁబెట్టి
రొక్క మీయఁదిట్టు లెక్కలుఁగసి పతిఁ
జదువుకొన్నయొక్క జలజగంధి.

విధవ—లోక మనేకవిధములు- మీరుసెలవిచ్చినట్లు దేనిదారి దానిదే.

ఒకఁడు—ముందుముందు మఱియు నన్యాయమని పెద్దలుచెప్పుదురు.

విధవ—మనకేలగాని, ఓపుణ్యాత్మా! నాబిడ్డఁడు నాకుఁగనఁబడునా? ఏదిక్కుననున్నాఁడు?

ఒకఁడు—దూరముగ దక్షిణముగనున్నాఁడు.

విధవ—దక్షిణదిశను నాకెవ్వరును బంధువులులేరు. నాప్రభువైన భీమేశ్వరుఁ డొక్కఁడుదక్క.

ఒకఁడు—ఏయూరమ్మామీది?

విధవ—నాయూరు గంగలోఁ గలసినది- మాపుట్టినిల్లుగూడ వేములవాడయే.

ఒకఁడు—సుబ్రహ్మణ్యముగారి పుత్రికవా?

విధవ—నాతండ్రి చల్లనివేళ జ్ఞప్తికివచ్చినాఁడు.

ఒకఁడు—ప్రొద్దువాలినది-నడచినడచి యున్న దానవు మాయింటికిరమ్మా. మీనాయన నాకుఁ బ్రాణస్నేహితుఁడు.

విధవ—(మొగముచూచి) సిద్ధాంతిబాబుగారా! అయ్యో! నేను బ్రదికియున్నపుడు చిన్నతనములోఁ జూచితిని. ఇద్దఱును-అన్నా అన్నాయని-(మొగముత్రిప్పుకొనును.)

ఒకఁడు—పాపబిడ్డవంటిదానవు; ఈయవస్థయెవ్వరికో గాని తప్పదు; విచారింపకుము.

విధవ—(కన్నులు తుడిచికొనును.)

వేఱొకపురుషుఁడు—(ప్రవేశించి) సిద్ధాంతిగారా! ఈచిన్నది యెవరు?

సిద్ధాం—ఈపిల్ల దానితండ్రికి నాకు బాల్యస్నేహము. నియోగమని వైదికమని మేమిరువురము గూడినప్పుడు భేదములేని వారము. నేను వారియింట నెప్పుడును నత్తెసరుపెట్టు నాచారము లేదు-వేములవాడలో నాకుఁ బరాన్ననియమము లేదు.

వేఱొ—ఈసంగతి నెక్కడనో చదివితిని-వర్ణభేదము పాటింపనివారు బైలుదేరుదురని. దానికిదృష్టాంతము-వైదికులలో మీరు, నియోగులలో

సిద్ధాం—అదియా! భారతఖిలములలో సింధుముని చెప్పినాఁడు.

గీ. ఋగ్యజుస్సామశాఖలరీతి మఱచి
ములికినాడును వెలనాడు మున్నగాఁగ
నాడులను బెట్టుకొనుచు బాంధవ్యమెల్ల
రగ్రజాతికి నభిమాన మావహించు.

ఉ. ఉందురు రెండురీతులనియోగులు వైదికులంచు వారిలోఁ
గొందఱు మేము మేలనుచు గొప్పలు చెప్పుచు నన్యశాఖలన్
నిందఘటింతురందు బహునీతులు చెప్పెడు పెద్దపెద్ద లే
యెందుల కిట్టిభేదమని యేకముగుండని బోధసేయుచున్

క. చందాయను నొకపద్ధతి
హిందూస్థానమ్మునుండి యేతెంచును దా
నిం దాము తాముగైకొని
యుందురు తమశాఖవృద్ధి నొనరుపలోలోన్

అని యజ్ఞేమేమో చెప్పఁబడినది.

వేఙో—పోనిండడిమనము చూడము. ఈయయ్యా యిమన సుబ్రహ్మణ్యముగారిలనగా భీమేశ్వరము-పాపము.

సిద్ధాం—ఆఁ! అద్దిగో-ఆలాగురమ్మ ఇఁకేమి సిగ్గును నెఱుఁగుదువు

విధవ—(సిగ్గునఁదలవంచి కన్నులుదుడిచికొనును)

వేఙో—ఇక్కడికేమిపనికై వచ్చినది.

సిద్ధాం—"సుపుత్త్రః కొంపపీకరః" అని కొడుకు దుస్సహావాసములంబడి యేకాశియో రామేశ్వరమో లేచిపోయినాఁడఁట

వేఙో—దుస్సహవాసము గలవారు కాశికిఁ బోవుదురా?

సిద్ధాం—అన్నదమ్ములలోఁ జేవతక్కువయైనది. తానే వెదకుటకు బయలుదేఱినది.

వేఙో—ఎన్నియేండ్లవాఁడు? ఎట్లుండును?

విధవ—తండ్రివలెనే గనికుఱుచగా నుండును.

వేఙో—ఎన్ని యేండ్లవాఁడమ్మా?

విధ—కార్తికపౌర్ణమి గాలివానకుఁ గడుపులోనున్నాఁడు, మఱునెలకుఁ గాఁబోలును పురుడువచ్చినది.

వేఙో—ఆహా! కార్తికము, మార్గశిరము, పుష్యము, మాఘము, ఫాల్గునము (అని వ్రేళ్ళు లెక్కపెట్టును)

సిద్ధాం—అది యేమి లెక్క? ఏసంవత్సరము? ఇక్కడ నేనుసిద్ధాంతినున్నాను.

వేఙో—(తెల్లపోయి) అన్నట్టు! కార్తికము సంవత్సరములలోనిదని లెక్కపెట్టుచున్నాఁడను.

విధవ—నా తెలివియుఁ దెల్లవాఱినది. నేనేమని చెప్పితిని;

వేఙో—ఎంతయీడుండునమ్మా!

విధవ—కూరపాటివారి రెండవకుఱ్ఱవాఁడు, వీఁడు నొక్కఁడయా డువారు, అంతపొడవరి కాఁడు.

వేఱా—అబ్బ! పదియేండ్లా, పండ్రెండేండ్లా వయసు?

విధవ—రెండునుగావు; పదునాలుగేండ్లుండును.

వేఱా—అప్పటికా యిప్పటికా పదునాలుగు?

విధవ—మీాకెప్పటికిఁ గావలయును?

సిద్ధాం—నాతల్లి యిప్పటి కెంతయీాడో చెప్పినఁ జాలును.

వేఱా—నాప్రశ్నకుఁ దగినట్లేయున్నది.

విధవ—అన్నగారూ; ఆఁడు లెక్కలిట్లేయుండును. ఇప్పటికిరువ దిసంవత్సరములు-

సిద్ధాం—ఆ పదునాల్గు లేచిపోయిననాఁటివయస్సు.

వేఱా—ఆతేండ్లక్రిందట లేచిపోయినాఁడా? మఱివర్ణము?

విధవ—బ్రాహ్మణవర్ణము; నియోగులము.

వేఱా—రంగమ్మా! నేనొకటియడిగిన నీవొకటి చెప్పెదవు

విధవ—నాపేరు రంగమ్మకాదు.

సిద్ధాంతి—నాప్రశ్నకు "అర్థాధికారుణాంగశ్చ" అని వచ్చిన దయ్యా!

వేఱా—ఎఱుపులోనే లెక్క; నల్లనివాఁడుకాఁడు.

విధవ—అయ్యో! యెఱ్ఱగానుండునా నల్లగానుండునా యని యడుగుచున్నారా?

సిద్ధాం—ప్రశ్నలో దక్షిణదిశనున్నట్లున్నది. దుస్సహానాస ములు కనఁబడలేదు.

విధ—బాబుగారు! జతగాండ్రెవ్వరు నూరు కదలలేదు! ఎక్కడనైనఁ జనువుకొనుచున్నాఁడేమో!

సిద్ధాం.—ఆఁ! విద్యాయోగమున్నది. పోనీగాని—ఈపరీక్ష పిల్లవానికిఁ దలవెండ్రుకలు పొడుగుగానుండునా.

విధవ—చిక్కుదీయకుండ నువ్వేదవు; నేనే దువ్వకొందునని చేతిలోని దువ్వెన లాగికొనువాఁడు. శాస్త్రుఁడు-తలనొప్పి, చెవులలో నీఁదవలదన్న మాననిచ్చినారా జోడివాండ్రు)

వేఙో—నేను శివరాత్రికి దాక్షారామ సప్తగోదావరములో స్నానము చేయుచున్నాఁడను.

సిద్ధాం—అమ్మో! దక్షవాటి మీయూరికి దక్షిణమేనా!

వేఙో—అంతనుండిలోనుండి కుడిచేతఁ బుస్తకము, నెడమచేతఁ బోడిబట్ట పట్టుకొని యేనుఁగీఁత సప్తగోదావరములో నిలువీఁతను దానినడుమనున్న మండపములోనికింతలోఁ జేరినాఁడు-ఎవ్వరోవిద్యార్థి.

విధవ— నాతండ్రికాఁడుగద! నిజమేనా? నేనేడ్చిపోదుననియా?

వేఙో—అయ్యో! బ్రాహ్మణుఁడు సంధ్యాసమయములో నబద్ధమాడునటమ్మా?

సిద్ధాం—కావచ్చును. అక్కడ విద్వాంసులున్నారు.

వేఙో—గురువుగారి యొద్దఁ బాఠము చెప్పుకొని వారియింటనే భుజియించి యట్లే యైదారేండ్లనుండి మండపములోఁ గూర్చుండి చదువుకొనుచున్నాఁడఁట.

సిద్ధాం—అక్కడికెవ్వరునువచ్చిచదువునకాటంకము చేయరని—

విధవ—ఇదిగో! పోయి నాపుత్త్రుని దీసికొనివచ్చెదను.

వేఙో—ఇపుడెక్కడికి వెళ్లెదవు? దగ్గఱా, దాపా! పురమునకు వర మైదామడ; వరమున కూరైదామడ? తెలిసిన లెక్కయే.

సిద్ధాం—ఆయవడారము నిక్కడికి బ్రాహ్మగ్రామము, అయిదామడకుఁ దక్కువయుండదు - భీకరముగానుండును.

గీ. కొడుకుమీఁది ప్రేమ నడిచితివే కాని
సీదు గోము సీదు నిదువంశ
మింతదవ్వు దెచ్చునే కాలవైపరీ
త్యంబు; దన్నియుంటి వమ్మనీవు.

విధవ—నిద్రాహారములు లేవు. నా కాళ్ళలో శని—ప్రక్క యూరనున్న నాబిడ్డ నెక్కరును దెలుపరైరి.

వేఱో—అమ్మాయి! నేనొకటి చెప్పెదను. నీప్రేమ బంగారయ్యోఁగాని నీవు పోయి పిలిచికొని రాకుము.

ఉ. ఒక్కకుమారుఁడంచు మనకున్నది చాలునటంచు నెందఱో
మక్కువచేత భావిగతి మాటఁదలంపక చిన్నవారలం
బ్రక్కను బాయఁజాలరు నిరంతర మొక్కెడ యుండునో సుతుల్
పెక్కురఁ గాంచెఁడో చదివి పెంపున కెక్కుట వారి నొప్పదో.

సిద్ధాం—అగునమ్మా నాకొక్కటి తోఁచుచున్నది.

చ. నినుఁగనుఁగొన్న యాప్పుడతనిం బిరివెట్టును బ్రేమ విద్యకుం
గనుకని నట్టువచ్చు; నొక కాలము, నిన్మఱపించి యొక్కఁడే
చనఁగలఁడేమి లోఁకకీఁకఁ జాలును విద్యయటంచు నందునిం
దును జెడి నీను వెంటఁబడుఁ దోఁటలు దొడ్డులు సంచరింపఁగన్.

వేఱో—శాస్త్రాధ్యయనము పండ్రెండేండ్లని చెప్పుదురు. అది మందబుద్ధులకొఱకుఁ జెప్పంబడినది; ఏమందువా?

మ. గురుభార్యాపరిచర్యలో సగము లోఁగుఁగన్ గడ్డిగాదంబుఁదే
నరుగుం గొంత కుమారు నెత్తుకొనఁగా నొఁగొంత యిట్లన్నియుం
బెరయున్నందులు నేర్చుచోఁ; జుఱుకులా విద్యార్థులేయున్నచో
గురులే కార్యముఁ జెప్పనీఁను మగువం గోపించు నాయాతఁడున్

సిద్ధాం—విద్యాయోగమున్న నీకొడుకు దీనింబట్టి యీయాఱు సంవత్సరములలోఁ బూర్తిచేసి యుండును.

వేఙ్కా—అబ్బో, అతని కాఱేండ్లేల? ఇంక నేదో క్రొత్తవిద్య నేర్చికొనుచుండును.

సిద్ధాం—అమ్మా! కష్టపడినన్ని దినములు కష్టపడవు.

ఉ. పండితుఁడై కుమారుఁడొకపార్థివునిం గనఁబోయినంతనే
నిండదె నీగృహంబు పరునింగననక్కఱలేదు హాయిగా
నుండెదు; నాదుజోస్యమున నుంచుము గౌరవ మొక్కకొంత నీ
నెంచుదలంపకీ పదనుంజుము నీగృహమందు నెమ్మదిన్.

విధవ—అయ్యగారు ఎవ్వతెనో యదృష్టవతిని మనస్సున నుంచుకొని నన్నోదార్చుచున్నారు.

సిద్ధాం—ఓర్చుకొమ్ము. దురదృష్టవంతులైనఁ గలకాల మొక్క రీతిగా నుండరు.

వేఙ్కా—చదువుకొనువానిం జెఱపవలదని చిన్నదాననైనను నిన్ను వేఁడుచున్నాఁడను.

విధవ—ఇంతటియుపదేశము చేసినవారింతవఱ కెవ్వరును లేరు. మీమాట లేల కాదనవలయును.

సిద్ధాం—ఏదో మామాటమీఁదఁ గొంత విశ్వాస ముండనిమ్ము నీవాఁడుదానవు. పిమ్మట రెండింటికిఁ జెడి నీకొడుకు నిన్నెట్లు కాపాడఁగలఁడు? నిన్ను మోసగించిన మాకేమిలాభము.

విధవ—నానోట బురుగులు పడవా. మిమ్మట్లు తలంతునా.

సిద్ధాం—

చ. నలుపురిలోన నాతఁడు మనంబున సిగ్గువడం ద్విజుండునై
తెలుఁగయినం బఠించుటకుఁ దిన్నగ నేరఁడయేని వానికిం

గలుగునె గౌరవంబు కలకాలము పీడునె లేమి వానికె
ట్టులు కుతుకంబు పుట్టును జడుల్ గణుతింతురు దాని నీగతిన్

విధవ—అదియెట్లు బాబుగారూ?

సిద్ధాం—మీరెఱుఁగ లేదో ఒకబుద్ధిశాలి—

ఉ. తాత నిరక్షరాస్యుఁడుగదా గడియింపఁడె మేటివిత్తమా
ఖ్యాతియె నాకుఁ దండ్రికిని నబ్బెను విద్య యెఱుంగనంతనే
చేతులు లేవొ; పూర్వమొక చిన్నఁడు మాకులమందు నొజ్జచేఁ
జేతను గొట్ట బెంగగొని చెల్లెను మాకది యచ్చిరాదనున్.

వేఱో—సాయంసమయమైనది. మీరు శివాలయమునకు రారా?

సిద్ధాం—రారాయని నెమ్మదిగా బతిమాలుచున్నావు. రాక చేయుపనియేమి. అమ్మాయి! రా; రమ్ము—జేపు చూచుకొందము.

(నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయాంకము.



# కళింగగంగు

## తృతీయాంకము.

(ఇరువురు దంపతులు పక్కలపై వేఱువేఱుగాఁ బ్రవేశించుచున్నారు)

(తెరలో రోదనము)

"నాయనా! ఇన్ని దినములు దిక్కుమాలిన దానిం జేసి మీ యమ్మను వీడి యెట్లుంటివిరా! మీయమ్మ చచ్చినను సరే యను కొంటివా!"

భర్త—(లేచి) ఓయ్! ఆఁ! నిద్రపోవుచుంటివా? (భార్యను లేపుచున్నాఁడు)

భార్య—(చటాలున లేచి) ఆ! ఆ! ఏమి! ఏమి! (అటునిటు చూచి) అయ్యో! లేపివైచినారా! ఏదో యూరు పెండ్లికి వెళ్లినామఁట. అక్కడ—

భర్త—కలకుఁగాళ్లు, జెంబునకుఁ జేతులు నుండవు, కాని యెవ్వరో గొల్లుమని యేడ్చినారు—వింటివా.

(మరలఁ దెరలో)

"ఏమే, మతిపోయినదా! చాఁలులెమ్ము! వచ్చినాఁడని సంతోషింపక యేడ్చుచున్నావా? ప్రేమచేఁ దల్లి కేడ్పువచ్చును! అందఱు

నిద్రిపోవుచున్నారు—ఎదిగెను వేళ నూరందఱు లేచున శ్లీల గోల యెత్తెదవు."

భర్త—ఎవ్వరది, ఇంకాఁక నెవ్వరో గట్టిగ నేడ్చినారు?

భార్య— మొన్న దాతూరామములోఁ జమువుకొనుచున్నాఁడని యెవ్వరో చెప్పఁగాఁ దమ్ముని బంపినది. ఒకవేళఁ దీసికొని వచ్చినాఁడేమో.

భర్త—ఓహో ! భీమిగానిమాటగాదు?

భార్య—ఇంకను భీమిగాఁడేనా; బాగుగనుండదు. చదువుకొని పండితుఁడై మన యూరికి వన్నె దెచ్చినాఁడు.

భర్త—ఎవ్వరును వినలేదులే—మనవాండ్రి కుఱ్ఱవాఁడు గనుక—వాని యొద్ద నట్లందునా;

భార్య—వినుఁడు—పెండ్లియఁట. కల వినుఁడు చెప్పెదను. ఆకలలో నిదియే గొడవ—

భర్త—వానిని దెల్లవారి చూచి వత్తుముగాని. యేదీ కల—

భార్య.—అపుడెం పెద్దదిగాఁ దోఁచినది; గాని, యిప్పుడు రెండుమూడు మాటలలోఁ దీరిపోవును. మేనమామ" మీయమ్మ యేడ్చుచున్నది. రమ్మని బతిమాలినా"డట.

భర్త—ఏమనినాఁడు? రానని నాఁడా; తాయెత్తి తలపై వేయబోయినాఁడా?

భార్య—మీరును వెఱ్ఱియేనా! చదివినవాఁడుగాని మూర్ఖుఁడుగాఁడు. చిన్నతనము తలఁపునకు వచ్చి—నాకు వేములవాడలో నుండ నిష్టములేదు; మాయమ్మనే యిందు రమ్మని చెప్పినాఁడఁట—

భర్త—బోడిగోడలలో బొమ్మలాట. ఈయూర నెందుకు; తల్లిని వాఁడెక్కడనున్నను బోషింపఁగలఁడు.

భార్య—ఇవి నాకలలోనిమాటలు—

భర్త—ఇఁక నీకల యేమిటికి? ప్రత్యక్షముగానే చూచి జరగినవి తెలిసికొనవచ్చును.

భార్య—ఏమిజరుగును—మీరేది చెప్పినను విరుద్ధమే.

భర్త—ఏమియునెఱుఁగనివానివలె నటించుచునా?

భార్య—లేదు. కడుపుచింపి కాళ్ళపై వైచికొందునా? అయ్యో! యింతకును విషయమేది?

భర్త—కుంతీదేవిమంత్రమువలె భీమేశ్వరునికి మ్రొక్కికొనిన మ్రొక్కు ఫలించినదని చెప్పుము.

భార్య—తరువాత వినుండు. తల్లి దాక్షారామము వెళ్లినదఁట. దేవుని నెదుటఁ బెట్టుకొని నిజము చెప్పుచున్నాఁడఁట—

భర్త—తల పొట్టలోఁ బెట్టుకొన్నదా; మీతండ్రిపై ఱాయివి సరి యడుగుచున్నదా!

భార్య—నయమే, మనకందఱకు సిగ్గువచ్చునట్లు నచ్చఁజెప్పినదఁట.

భర్త—నాకే కాదు. నాయూరివారికందఱకు సిగ్గే యున్నదా?

భార్య—నన్నడిగితిరా, యది యుత్తమురాలు. నాకుఁ దలంపునఁ దోఁచుచున్నది. వారును మనమును శివరాత్రికిఁ గోటిపల్లి వెళ్లినాము. తీర్థమునాటి కది స్నానము చేసినది—మన యింటికి వచ్చి మామగారి తద్దినమునాఁడు నన్ను పొరుగింటికిఁ బొమ్మని యత్తగారు పనిచేసికొనుచుండఁగా నేను వీధియరఁగెక్కినాను. కోడికూఁతవేళ.

భర్త—ఇరువదియేండ్లనాఁటి మాట యిప్పటిదానివలెఁ జెప్పుచున్నదానవు.

భార్య—మఱియిప్పటిమాటలా—కావుననే మీకీసూత్రములు మఱపునఁబడినవి.

భర్త—ఈ యేఁడు లెక్కలు వద్దు వ్రాసికొని కూర్చుందుమా?

భార్య—ఈ యేఁడు లెక్క లే—మనకందఱకుఁ దలవంపులు తేఁ బోయినది! కులము చెడఁబోయినది. విష్ణుచక్రి మద్దురాకున్న నేమగునో.

భర్త—చెప్పుము; చెప్పుము; నీదేదో క్రొత్త దారి—

భార్య—పాఁత దారియే—వినుండు కంబళి ముసుఁగు పెట్టుకొని నేనరుఁగు మీఁదనె యుంటిని- గొల్లుమని మీరు భీమనాథమునకు ధనుర్వాతమని వేగో వెల్లంకో యని పరుగెత్తినారు—అయ్యో! తద్దినమాయని యత్తగారు తలుపుమూసికొని పరుగెత్తినారు.

భర్త—సరి; తెల్లవారినదిగదా, లెమ్ము. అన్నియు నక్కడనే వినవచ్చును.

భార్య—ఆఁ! ఈపాటికే వచ్చినవారియొద్దనెల్లఁ జెప్ప గూర్చున్నారా!

భర్త—అడుగుట కెవ్వరు కూర్చున్నారు.

భార్య—నాకుఁ దెలిసినమాటలివి.

భర్త—అట్లయిన, వీఁడు కడుపునఁ బడిన పిమ్మట భీమనాథము మరణించెనందువు.

భార్య—తెలియనివారేమనుకొన్నను నాకుఁ దెలిసినదింతే.

భర్త—మఱి భీమేశ్వరుఁడే తండ్రియని చెప్పుకొనుట యెట్లు కలిగెను?

భార్య—మీకేమి పిచ్చియా, వెఱ్ఱియా? ఆలాగే యనుఁడు. భీమేశ్వరుఁడే తండ్రియనుఁడు. ఎక్కడనైన గురువుపేరు, తాతపేరు దైవముపేరు పెట్టుకొందురుగాని శుద్ధమూర్ఖులైనను దండ్రిపేరు తనయునకుఁ బెట్టుదురా? తల్లిభక్తికొలఁది దేవునిపేరు పెట్టినది.

భర్త—దిక్కులేనివానికి దేవుఁడే తండ్రి.

భార్య—మనకుమాత్రము దేవుఁడు తండ్రికాఁడా? రామయ్య తండ్రి యనుటలేదు? వెక్కిరింతలకు తలయుఁ దోఁకయుఁగలదా!

భర్త—సత్యమే. నుతిఁబుట్టికింవదంతు లేలపుట్టవలెను.

భార్య—మనము వర్ణభ్రష్టులము కాకుండుటకును దానిప్రఖ్యాతి దేశమున వ్యాపించుటకును—అనికొననింతు—ఏకట్టైను నిష్పుండి నాకట్టైయే కాలును. నిజము దేవుఁడెఱుఁగును.

భర్త—(చూచి) వెలుఁగేవచ్చినది. కట్టైవంపు ప్రొబ్బుదీర్చినది. మనసందేహములకు మనమే సమాధానము చెప్పుకొంటిమి—బాగు.

భార్య—ఎఱిఁగియున్నదాని కొకరి నడుగనేల. కాని, యొక విషయమున్నది.

భర్త—అదియేది?

భార్య—పండితుఁడై యమృతవాక్కులు గలిగి భీమేశ్వరుని కటాక్షమున నాడినదియాటయుఁ బాడినదిపాటయు నగుచున్నదని కలలోఁ దెలిసికొంటిని—అది యెంతవఱకు సత్యమో—

భర్త—నీకల యెక్కడనో పెండ్లి; దానికి దీనికి సంబంధము—

భార్య—సగముసగము విని సంబంధము నెట్లుచెప్పఁగలరు.

భర్త—పెండ్లికిని,—ఆడినదియాట— పాడినదిపాట—దీనికిని సంబంధమెవ్వరు గలిపెదరు.

భార్య—పెండ్లిలో నాడినదియాట కాఁగూడదా?

భర్త—ఇట్టి మాటలు నాకును వచ్చునుగాని కలలో దీనికి సంబంధము చూడనిమ్ము—

భార్య—సదస్యమునాఁడు సంతర్పణము జరిగెనదఁట—భీమన్న మడిగట్టుకొని వంటపందిరిలోనికి వచ్చెనట—ఎవరో విస్తరియొద్ద గూర్చుండి పరిషేచనము చేయునపుడు పీడపాత్రేయుఁడన్నారట.

భర్త—తరువాత?

భార్య—కోపించి లేచిపోవుచు, మీయన్నమంతయు సున్నము, మీపప్పంతయు నుప్పుకావలయునని పలికిపోయెననియు, వారందఱు బతిమాలికొనిరనియు.

భర్త—అది యసత్యముకావచ్చును. పద్యరూపమున నేరాజు నోయాశీర్వదించిన నైశ్వర్యముపట్టుట—తిట్టినహీనదశవచ్చుట—యిట్టివానింబట్టి యమృతవాక్కుల సంగతి తెలియవలయును.

భార్య—లేకెందు. బాత్తిగాఁ దెల్లవాఱినది.

భర్త—నాకింకొక సందేహము బాధించుచున్నది.

భార్య—మీ మాత్రబాధానివారణము నేనుజేసెదను. చెప్పుఁడు. చెప్పనక్కఱలేదు. నాకే తెలిసినది—చెల్లెండ్రను మోటుదనముగా గొందఱు హాస్యముజేయుచుందురు మాపెద్దతండ్రికొడుకు మాపినతల్లి కూఁతును హాస్యమాడుచుండువాఁడు.

భర్త—అన్నకుఁ జెల్లెలికి హాస్యమా,

భార్య—అదితోఁ సాగను. మొద్దులాగున నెదుటనున్నాఁడు. నీ మొగమున బొట్టులేకున్నను భయములేదని పల్కువాఁడు—అదియేదో గొప్పయని కొందఱుభావింతురు.

భర్త—పరుషముగానే యున్నది—మృదువుగా లేదు.

భార్య—మగఁడుబ్రదికియున్నదాని నిట్లుహేళనము చేయువారుండఁగా మగఁడు చనిపోయినపిమ్మట విధవాగర్భమునుండి పుట్టినపిల్లవానిని వరుసకు మేనమామలు—విధవకొడుకాయనుటకు వింతపడనక్కఱలేదు.

భర్త—చక్కఁగనే సందేహము తీర్చితివి. కావచ్చును. మనమే తుమ్ముకొని మనమే చిరంజీవియనుకొంటిమి. అయ్యో! పొద్దెక్కినది లెమ్ము.

భార్య—లేదు,—లేదు. కోఁడికూత వేళ—ఇంకొక గడియ పండుకొన్న మంచిది—(అని నవ్వుచు లేచుచున్నది)

(నిష్క్రమణము)

(భీమకవి—గోవిందశర్మయుఁ బ్రవేశించుచున్నారు.)

భీమ—గోవిందా! ఇట్టివి యేమైనను దగులవలయునుగాని ప్రతివిషయమున చేదియో శ్లేషార్థముండనేయుండును. అన్నింటికిందగిలిన యెడల లోకమాఁగునా—పట్టినదెల్ల బంగారు కావలయునని వరము కోరిన పూర్వరాజు చరిత్రము వినలేదా?

గోవిం—ఎత్తుకొనిన కొడుకుఁగూడ బంగారు ప్రతిమయయ్యె నఁట.

భీమ—అట్లే చిక్కువచ్చునుగదా!

గోవిం—లోకులు చెప్పుకొను మాటలు—మీరు సప్తగోదావరములోని మండపములోఁగూర్చుండి "వదంతి" యనియో "కథ్యతే" యనియో "ఉచ్యతే" యనియో సంస్కృతమునఁబలికి దానికిఁ దెనుఁగర్థము చెప్పుకొనునప్పుడు ఉచ్యతే పలకపడుచున్నది యని పల్కితిరనియు నప్పుడా మండపము ఊతిపలక యొకటి పడియెననియు—

భీమ—అజ్ఞానుల కల్పనములోని నిస్సారమది—

శా. ఏరైఁనన్నగరా! పదంబు సరియా! యిల్లానె? నీయిల్లు బం
గారౌరాయన నౌనె! లగ్నమును నక్షత్రంబు నింద్యాక్షర
ప్రారంభంబును జేర నెగ్గు లొదవుం బర్యాయరీతి న్నుడు
ల్నేరన్వాల్వమునంతిలో జరుగఁదుల్యుండాతఁడా నీశుతోఁ

గోవిం—పదంబు సరియాయనిన నర్థమేమి?

భీమ—పదశుద్ధివలదా? పలుకఁబడుచున్నది—ఊతిపలక పడుచున్నది. రెంటికి భేదముం గనిపెట్టుము. అది యకారమధ్యము—సబిందుకము. ఇది యకారమధ్యము—నిర్బిందుకము.

గోవిం—(తనలో) విద్యాగంధము లేనివాఁడనగుటఁగదా యిట్టి స్వల్పభేదముం గనుఁగొనలేక యడిగితిని— నాకంటె శుద్ధనిరక్షరకుక్షులు ముందు బైలుదేఱవచ్చును—వారికి నేను బెట్టినదే భిక్ష.—

భీమ—సోముఁడు పోయినతావున నేమైన నిట్టిచిత్రముండిన నుండవచ్చును. నిరర్థకమని యెఱిఁగియు బహుదూరములో విడిచివచ్చితిమి పాపము! గుఱ్ఱమును, సీతను బెట్టి చెప్పిన పద్యములో-

సోమ—(ప్రవేశించి) రాజన్న వీఁడే రాజు; కవీశ్వరులన్నభయము లేనివాఁడీతఁడొక్కఁడే. ససేమిరా గుఱ్ఱమును విడువనని భీష్మించినాఁడు. (పరికించి) ఇదె మనవారిక్కడనేయున్నారు. (నడచును.)

భీమ—ఇదిగో సోముఁడు! గుఱ్ఱమునిచ్చినాఁడా?

సోము—పద్యమునకుఁ బాటలకు భయపడను—సంగీతమునకుఁ జింతకాయలు రాలవు. వచ్చినదారినే పొమ్మనినాఁడు.

భీము—ఒకరిద్దఱు నన్నిట్లు పరీక్షింపవలసినదే. అప్పుడుగాని నా సత్తువ నాకుఁ దెలియదు.

క. శ్రమపడి జ్యోతిశ్శాస్త్రము
సమితప్రజ్ఞులను జేరి యభ్యాసంబే
ను మహాసూక్ష్మాంశంబుల
నుమ శాపము లెగిరిపోవ నొనరింపనొకో.

గోవిం—పార్వతీశాపము సత్యము కాదా?

భీమ—సరిగా గుణియించుటచేతగాక తప్పినవానికన్నింటికి జోస్యులు పార్వతీశాపము నతుకుచుందురు.

సోమ—ఆహా! ఆరాజు ధైర్యము—సోతరాజే పట్టినపట్టువిడువలేదు. తమ్ముఁ డేదోచెప్పఁబోయిన- వట్టిమ్రాను చిగిరించునట్లు చేసినను నన్నికవి యేమియుఁ జేయలేఁడనియెను.

భీమ—అదిగో, ఏదియో కల్పించినారు, ఇఁక ఱేపుచచ్చినవానిని బ్రతికించెనని కల్పింతురు.

గోవిం——మనయశ్వముపోయిన నేరాజైననిచ్చును- తనయశముపోయిన- దానికి నాకతక్షమున్నదా.

సోమ——మన కేమి; యీసజ్జనగరమున నేమికావలసినను దొరకును.

భీమ——నా కదియును సందేహామే. ఇక్కడ పరివేశము, పరియాణమును మంచిలగ్నమున బడలేదు.

గోవిం——పాప మీరాజునకుఁ గూడఁ బరరాష్ట్రభయము కలిగి నదఁట.

భీమ——అహిభయ పరభయములు రాజునకుఁ దప్పవు.

సోము——అహిభయమనఁగా——పాములభయ మేనా?

భీము——కాదు-పరభయమనఁగా నితరరాజులవలన భయము; అహిభయమనఁగా స్వపక్షజనులచేఁ గలుగుభయము.

సోము——(గోవిందునితో) చూచితివా; అక్షరజ్ఞానము లేని మన తెలివి తేటలు-గ్రచ్చకాయలాటలో వెక్కిరింతలు జ్ఞప్తియందున్నవా-

గోవిం——నేనిందాఁక నిల్లే ప్రవ్వాలోఁ గాలువైచితిని; భయము లేదు. ముందు ముందు నోటికివచ్చినదెల్లఁ గవిత్వమని-యుద్గ్రంథముల యర్థమును సంప్రదాయములను మఱచు జనులుపుట్టెదరఁట-

సోము——స్వాముల వారి పీఠమునకు దక్షిణలు ప్రోగుచేయువారి వలె భోజనపుష్టిచే మనమీాయనయొద్ద సర్వజ్ఞులవలె విఱ్ఱవీగుచుందము; ఆక్షేపింపకుండఁ జల్లగబోధించినాఁడు.

గోవిం——ఇప్పుడు కాలినమట్టి కాలనిమట్టి కలిసికొనదు-

సోము——సగము కాలమునకు చదువుకొనక మన్నుగొట్టు కొందుమా.

భీము——ఈరాజునకుఁ గష్ట కాలమును బరులకు మేలును గనఁ బడుచున్నది. (ఆలోచించి)

ఉ. రాజకళింగగంగునకు రాజ్యవినాశము తోఁచుచున్న దే
యోజనఁజూచిన; న్మనము నూరక పోవుట మేలుగాని య
వ్యాజములైన పద్దెముల నంపెద నాతని మేలుగోరి యే
రాజును లేదు కాదనినరాజ్యములున్నవె పండితాళికిన్.

గోవిం—(తనలో) ఇక్కడ నాకు సంశయమే. కళ్లుపెళ్లుమనున ట్లే యున్నది.

భీము—(ఆకాశమువంకఁజూచి) సోముఁడా! ఆకును గంట ముఁ దెమ్ము.

సోము—(తెచ్చియిచ్చుచున్నాఁడు)

భీము—(వ్రాయుచు) సరి- ఇక్కడఁగూడ నపశకునమా! గం టము బ్రద్దమొనయైనది- ఈగంటము నాయొఱలోనిదికాదా ?

సోము—ఇది నాది- నిన్ననే నూఱినాఁడను.

భీము—నీగంటము నాకు వ్రాయదు- నీవైదువ్రేళ్లుపట్టుదువు- నాయిత్తడిపూసగంటముందెమ్ము. పోనీ—(అని వ్రాయుచున్నాఁడు)

గోవిం—(తనలో) ఆతనిమేలుగోరి వ్రాయునదియేదియో వో పిక పట్టి చూడవలసినదియే.

భీము—(వ్రాసి) గోవిందా! ఈసారి నీవు పొమ్ము. సమయము చూచి రాజునొద్ద కీ పద్యములను బంపుము.

గోవిం—అట్లే- (అనిపుచ్చుకొనిపోవును)

సోము—గోవిందుఁ డిప్పటికి రాజద్వారముచేరును.

భీము—మొదటిపద్దెముకంటె రెండవది కొంచెము స్వాతి శయమును- అవినయమును జూపుచున్నదా!

సోము—కొంచెమట్లేయున్నది.

క. "శాపానుగ్రహపటువును
రాపాడెడుకవులనెత్తిఱంపంబనఁగా
భూపాలసభలఁ బూజ్యుఁడ

నా పేరే భీముఁడంద్రు నరవరసభలన్."

ఇందు రాజనింద లేదు గాని—

భీము—కానియేమిటి- సర్వనిందలుఁగలవు నీవు చెప్పవుగాని-

సోమ—నాకిందలిచమత్కారము లట్టె తెలియలేదు.

భీమ—చమత్కారములు లేవు.

సోమ—అట్లయిన నిందను లేవు.

భీమ—పెసరపప్పు పద్యమేనా?

సోమ—కావలసిన ముక్కలున్నవి. పణముగానే పడినది.

భీమ—ఇప్పటికవి రాజసన్నిధిని జదువఁబడవా?

సోమ—ఇంతసేపా! తిరిగియే వచ్చుచుందును.

భీమ—ఈపై పద్యము క్రొత్తది కాదు.

క. తెలుఁగాధీశునిసభలోఁ
జళుక్యనరనాధుసభను జదివినదే యీ
వలఁ దోఁచె శంక కాస
మ్ములుకంగా నేల దీనికొకదానికినై.

సోమ—అంతయులుకుట కేమున్నది- సత్యమేగదా.

చ. కవులననెన్ని పుట్టువులు గాంచిన నర్థ్యలుగాని వారలే
కవులము మేమటంచుఁ గను గర్వమునం దెగఁద్రిళ్లుచుండఁగాఁ
గవులకు నెత్తిఱంపమవు గావొకొ రాజుల పూజనందవో
భవకరుణాపరిభావుఁడవు వ్యర్థములౌనొకొ నీదువాక్యముల్.

భీము—ఆఁ! అన్నియుసార్థకములగునా? అట్లయిన నింతవంత యేల- రాజధనాగారమురోని రెండుసంచులు మనయింటికి రమ్మనిన రావా.

సోమ—మనకుఁ గొఱంతయేమి- వంతయేమి.

భీము—కొఱంతయే- వంతయే- పమందువా?

మ. ఎవరో రాజునుజేరి వానికృపచేఁ గృత్యర్థనిర్మాణమో
వివిధచ్ఛాత్రగణంబు దిద్దుటయొ హృద్వ్యథిన్ భవచ్ఛేద్యునా
శివునిన్నిల్పుటొ కాక యిల్లిలును వాసిం గోలుపోఁ దిర్గుటో
కవియన్వానికి నెత్తివ్రాఁతయిదియేగా వంత వేయున్నదే

సోము—కవికి వంతయేమి? కవిగౌరవము రాజునకు లేదు.

భీమ—గౌరవ మెవ్వరు చూపుచున్నారు. లేదు సొమ్మని కుక్కవలెఁ గొట్టెదరు- చూడలేదా.

శా. ఏదీపెట్టుమనంగలే దొకతృణంబే నీయలే దూరకే
కాదే బందెలఁబెట్టి గుఱ్ఱమును నన్నా! గౌరవం బెక్కడో
వాదం బాడఁడె పోతరాజు కనుమా వంతౌగదా యిద్ది మ
ర్యాదా నే యిటువిప్రసొమ్మును నె భోజ్యంబీ మహీజానికిన్

ఇంక నిక్కడ నేమిపుట్టునో- మాదేశమునకు వచ్చినపండితులకు గంటాలపన్నున్నదనునో యేమో- ఏతితెచ్చినసొమ్ము వీరికిక్కడ నిచ్చిపోవలసిన ప్రసంగము రాకున్న మంచిది-

సోమ—అట్లనఁకుగాని- యుద్ధమధ్యము-

భీమ—కావుననే సమయముగా దింకొకప్పుడు రమ్మనవచ్చును. ఏమందువా!

క. సామర్థ్యము నెఱుఁగరు నా
నామంబే యెఱుఁగరింక నానాస్థలభూ
స్వాములు క్రొత్తగ భీమా
రామముఁ జెడఁదిట్టినదియు రాలేదిటకున్.

సోమ—అద్దె! కోపింపకుఁడు మనవశమేదియుఁ గాదందురే! భీమవరము నెట్లు నశింపఁదిట్టినారు?

భీమ—నేనందుఁ బెద్దనుగాను; ఆపురప్రారంభముహూర్తము స్థిరలగ్నమున జరుగలేదు.

గోవిం—(ప్రవేశించి తలవాంచి యుండును)

భీమ—నీముఖమే చెప్పుచున్నది; తలయెత్తుము.

సోము—రాజదర్శనమైనదా?

గోవిం—రాజద్వారమున కీవలనే యుంటిని.

సోము—పద్యములు లోని కెట్లు చేరినవి?

గోవిం—కవులకుఁ బండితులకు నిది సమయమని పెదవివిఱుచుచునే యొకఁడు కొనిపోయినాఁడు.

సోము—ముం దీసేవకుల యడ్డంకులే యెక్కువ—

భీమ—అట్లనకుము- సదా రాజద్వారముననుండు సేవకులకు సమయాసమయములు తెలియును.

సోము—నీవు దానిని కవివిషయము కానటులు పంపవలసినది.

గోవిం—నన్నుఁగూడ నసద్వ్యాపారమునకు దిగుమంటివా.

భీమ—ఊఁ! ప్రత్యుత్తరముం దెల్పుము.

గోవిం—దానిమీఁదనే త్రిప్పి వ్రాసినారు- చూడుఁడు.

భీమ—ఇది మంత్రిగారివ్రాలు- రాజానుమతంబున-

గోవిం—రా జెఱుఁగునో, యెఱుఁగఁడో సందేహమే.

సోము—మంత్రి నిర్బంధమున రాజు సమ్మతించియుండును

భీమ—అది యెట్లు ?

చ. గురుకవికోటియన్నఁ జెవిగోసికొను న్నృపుఁడంచువింటి నే
నరయఁగవచ్చినాఁడ సుదినమ్ములు గావివి నాకు వానికిన్
వరపుడు మంత్రిమాన్పినను వారణసేయునె! యుద్ధమందు నె
వ్వరుభుజియింపరో పనులుఁ బాటులుఁ జూడరొ యింతమౌఢ్యమా

గోవిం—రాజు పండితులను గారవించు నన్నది మెఱమెచ్చులకే గాని మనస్స్ఫూర్తిగఁగాదు.

సోము—నిజముగాఁ గవులకుఁ బండితులకుఁ రాజాస్థానముల గౌరవము జరగుచున్నది.

గోవిం—లేదనియే నేను దలఁచెదను.

భీమ—

మ. వరజాంబూనదరత్నభూషణములశ్వశ్రేణి సాంద్రోళికల్
పరమానందముతోనొసంగెనని గొప్పల్ వ్రాసి భూషింతు రి భూ
వరులం బొడితు లంకాలోఁ బరకపాల్ ప్రాప్త్యల్పసంతోషుల
ట్టిర నా సందడి దీరరమ్మనుట ఘట్టిబ్యాంతలీనాఁటికిన్.

ఏమి చేయవచ్చును, కాలము కర్మము రెండును గూడిరావి.

గోవిం—ఎక్కడను గలదియే. వేయునూటపదార్లు శుల్కము లిచ్చి, కట్నములిచ్చి పెండ్లిండ్లు చేయువారు పాన్పుమీఁదిప్రాఁతగుడ్డ చాఁకలికీయక యీఁకుబకుచుదని లాగికొందురు.

సోమ—చాఁకలివానికంటెఁ బురోహితుని—

గోవిం—అది మఱియుంజిత్రము—సువర్ణమంత్రపుష్పము—సువర్ణమంత్రపుష్పమని పలుమారు చేయిచాఁచువానికి—కానింకు కానిండని ప్రక్కవారనుచుందురు—కానియే వానికి—

భీము—ఇప్పుడు చేయవలసినది—

గోవిం—ఈమంత్రికి బుద్ధిచెప్పిపోవుట—

సోమ—రాజునకుఁ దెలియునట్లు చేసి యీసందడియేదో తీఱనిచ్చి మరల వత్తము.

భీమ—

చ. తొలుతనె చెప్పనే మనము దుష్టముహూర్తమునందువచ్చినా
రలమని, మంత్రిఁదిట్టినను రాజును దిట్టినఁ గార్యమేమి నా
యలుకయె కాని; కారణము లారసియుం; బరరాజనొత్తుడుల్
దలమసిపిందు నన్నియు విధాత్మవశంబులు చెప్పనేటికిన్.

(ఆలోచించి) కానిమ్ము—ఈకొన్ని పద్యములనుగూడఁ బంపి మఱియింటికిఁ బోదము—రండు—

(నిష్క్రమించుచున్నారు)

—ఇది తృతీయాంకము—

# కళింగగంగు.

## చతుర్థాంకము.

(రాజకళింగగంగు—రాణియుఁ బ్రవేశించుచున్నారు.)

రాజ—(దీనవదనముతో) దేవీ! మొదటినుండియు నీసందేహములే నిన్నుఁ గ్రిందఁదీసినవి.

రాణి—నాథా! ఇంకను దేవీపదము నాకెక్కడిది. పుట్టగోఁచులు పెట్టుకొని మట్టితట్టలు మోయుచున్నను గొందఱు తమకుఁదామే దొరగారనికొనినట్లు నేనీపదమునకు దూరంబనైతిని.

రాజ—(చేయిపట్టి) దేవీ! మనుజునకుఁ బేరులు ధనధాన్యముల కలిమిలేములం బట్టి మాఱునందువా? కృతాభిషేకవు నీవెన్నఁటికిని నాకు దేవివే—

రాణి—బిచ్చమెత్తుకొనుదాసికి లక్ష్మినామమువలె నాకు బరువుగానున్నది. (దీనముగ) నామాటలన్నియు గడ్డిపోఁచక్రిందఁ గట్టినారు. నేను జెప్పుట లేదా.

రాజ—నీవేమనుకొన్నను మంచిదియే—

ఉ. సంగరసంగతిం దగిలి స్వాంతము పెక్కుఁదెఱంగులైన నే
భంగి వినోదముల్ జరుపవల్దనియుండితి మంత్రిచేసి నీ

యంగద కాలవాలమగు నట్టివిధానము స్వామిసాక్షి; యీ
సంగతి నే నెఱుంగ గ్రహచారదినంబులు తప్పశక్యమే.

రాణి—కడచినదానికి వగచిన నేమిఫలము. సర్వస్వాతంత్ర్యములు మంత్రికిచ్చి మీ రూరకున్నారనుటయే మన యాంగదకు మూలము.

రాజు—అగును. నీవనవలసినదియే.

రాణి—శివశివ! అనుటకు నేనెవ్వతెను. మీరు రాజ్యము చేయుచున్నఁ బట్టపురాణి నగుదును. బిచ్చమెత్తుకొనుచున్న మండమోచికొనివత్తును.

(తెరలో శతఘ్నిమ్రోఁత)

రాణి—(ఉలికి) ప్రజపురుషునకు నాఁడుదియనిన లోకువైనది. స్త్రీబుద్ధిస్త్రీబుద్ధియని చెవినిబెట్టరు.

రాజు—నీమౌర్ఖ్యమునకుఁ బ్రతిమౌర్ఖ్యము వహింపక తప్పదు. నేనీసందర్భమున నేమియు నెఱుఁగను. నేనాకవీశ్వరునిఁ బొమ్మన లేదు. సందడితీఱినపిమ్మట రమ్మన లేదు. నేనేమియు నెఱుఁగను.

రాణి—(కన్నులు తుడిచికొనుచు) ఈదుర్లంఘ్యమైన కాలము నైన నెఱుఁగుదురా.

రాజు—బలద్విరోధికృతమైన దాని నెఱుఁగుదును.

రాణి—పండితకవికృతమైనిదాని నెఱుఁగరా?

రాజు—ఏదిముందో నీవెఱుఁగుదువా.

రాణి—యాదవకులవినాశనమునకు బ్రాహ్మణశాపముముందా, గాంధారిశాపముముందా?

రాజు—మొదటిదేయని యెల్లవారికిఁ దెలియును.

(తెరలో మరల శతఘ్నులధ్వనిపిమ్మట)

రాజా! రెండును రెండును—

రాణి—(బెదరుచు) ఈయుపశ్రుతి యేమి? ఓభీమనాథ! (అని చేతులుజోడించి యాకసమువంకఁ జూచును)

రాజు—ఆపల్కినది మనరాముఁడు.

చ. పడమటిచాయఁ గొందఱును బ్రాగ్దిశఁగొందఱు వీళ్లుదీర్చిరి
క్కడనుఱియక్కడంగలది గాటపుసాహిణిమూరుసేన మో
బెడిదపు రాయలంపినదొ వేగమ యూరసి రాఁగఁ బంపని
ప్పుడుచని వచ్చురాముఁడది పోలిచిరెండును రెండునంచనున్

రాము—(ప్రవేశించి) రాజా! రెండును. రెండును రాజా!

రాణి—శీఘ్రబుద్ధిః పలాయన మ్మనునదితప్ప మనకిఁక నాధార మేది?

రాజు—(తనలో) ఈమె దుఃఖాతిశయము నోర్వఁ జాలక నన్ను రాజాయని యుపాలంభించుచున్నది. సమయము—దేహీయని లక్ష్మీపతికి బిచ్చము పెట్టిన బలిచక్రవర్తి గాఁడిదరూపుదాల్చి యుమ్ముగఁ దినుచు సింధ్రిని యుపాలంభములకు సహించినాఁడు.

రాణి—త్వరలో నుపాయమాలోచింపుఁడు

రాజు—ఇదివఱకే యాలోచించితిని. మఱియిప్పుఁ డుత్కృష్టాపకర్షతోఁ బనిలేదు— రామూ!

చ. ఒకరొకరెత్తివచ్చినను యుద్ధమునన్ సరిదాఁక నేర్తురే
యొకరును వీరిలోన నది యోజనచేసియె కట్టుగట్టి మా
ఱుకొనఁదలంచి రింతట హఱుంగుట లెస్సయొ కాని వేఱుగా
దొకరికిఁ జెప్పకుండుఁడును నోపికవట్టి పెనంగి చూడుఁడా.

రాము—హామహారాజ! నవలక్షకళింగాధీశ! ప్రతిదిన శతశివాలయార్చనమైనను నిన్నుఁ గాపాడ లేకపోయినదా? హాకళింగపట్టనమా! నీవనాథవగుదువని యేజ్యోతిష్కుఁడును జెప్పలేదు. హా! ప్రజలార! మనమెంతనిర్భాగ్యులము. హాభగవతివంశధార! సత్యసంధుఁడు

మా రాజునకిట్టియవస్థపట్టినది. ఇఁకవర్షములు కురియవు. నీకు మాకన్నీటి ధారలతోఁ గలుషమగుటయే.

రాణి—రామ! నిన్ను మే మోదార్పవలసివచ్చినది.

రాము—మిమ్ము విడచి మే మెట్లుందుము.

రాజ—ఇట్టివిచారమునకిది యసమయము. మమ్ము నెల్లవాఱకుండఁ బురంబు వెడలింపుము- తామసింపకుము.

రామ—హా! ఎంతపాపాత్ముఁడను. మిమ్ము నేనా యీనగరము వెలువరించువాఁడను! ఇన్నిదినములు జీవించి ది యుంటికా ?

రాణి—దైవము వెడలించుచున్నాఁడు. అతనికంటె మహత్తరప్రభావముగల మీమంత్రిగారు.

రాము—ఆహా! మంత్రిశేఖరా! ఎంతకుఁదెచ్చితివి!

రాజ—చ. వెతపడఁబోకు రామ! పదివేలవిధంబుల మమ్ము నెవ్వగే
మతినడుగన్వచింపకుము మంత్రిని దూఱకు మాకు నేడ్వను
న్నతవిధిచాటలేము కవినాథులొనర్చినదేమి లక్ష్మిశా
శ్వతమొకో హెచ్చులొచ్చులవి చక్రముపోలిక కుందనేటికిన్

రాము—మహారాజ! మీరెక్కడికేగునదియు నాకే తెల్పలేదే! నేనెవ్వరికి దెల్పగలను. నేనజ్ఞానిని- ఎటులనఁబోయి యెటులందునో- మీయొద్ద నేనవెఱ్ఱిమొఱ్ఱిమాటలన్నను మీరు మన్నించుచున్నారు.

రాజ—నీవు నేర్పఱివి కావుననే మాయొద్దనీకు మన్ననగలుగుచున్నది.

రాము—నాయనుగమనమున కొడంబడవలయును.

రాజ—నామాటవినుము మేమెందుఁబోవునదియు నీతోఁదెల్పము. నీవెట్టులెవ్వరితో నాడినను భయములేదు. కాని, మమ్ముఁ బురంబు వెడలించినది పరులకుఁదెల్పకుము. నీమేలుమఱవను నీవిందే యుండుము.

రాము—నేనెట్లుండును. నాకేమియుఁదోఁపదు.

రాణి—ఒకరిద్దఱకంటె గూఢవాసమునకుఁ బలువురున్న—మనకుఁ బాండవులకువలె నేమిదైవసహాయమున్నది?

రాము—హా దైవమా? నీసంకల్పమునకడ్డు లేదు. నీవు తీర్పవ్రాయుటకుఁ గలము పట్టితివా యొక్కటితుడుపు గాదు. ఈసూర్యప్రతాపుని, ఈచంద్రముఖిని గూఢచర్యను ద్రిప్పఁ దలఁచితివి. నీవు పట్టు నెగ్గించుకొందువు. నీవిలాసమిది. ఆభరణములు తీసివేసిన యానవాళ్లెన్నినాళ్లకు మాయును. ఛీ! అభాగ్యపునోరు—మణిప్రతిమలకు మసిపాఁతలా. ఎంతచీఁకటిలో వీరిని దాఁచెదవు. దేవీ! మహారాజు వేటనెపంబుననైన గుట్టలు మెట్టలు మెట్టియున్నాఁడు. అది యిపుడుపకరించు. నీవుక్రొత్తగా నభ్యసించెదవా?

రాణి—అందఱును బుట్టువతోనె యభ్యసింపరు. కొన్నియిట్టివి దైవము నేర్పును. ఎన్నఁడైన నీవుకంటఁదడి వెట్టితివా ఇంతకరుణముగా నేడ్చుట నీకెవ్వరు నేర్పిరి!

రాము—హా! నాప్రాణము లీమేను వాయవు!

రాజ—(విచారముతో) ప్రజలు రాజునకుఁ బ్రాణము. ప్రజలం బాయుచున్న నాకీదశయిట్టిదని చెప్పవలయునా?

రాము—మహారాజ! ధైర్యశాలికి నీకిట్టిదశ ప్రాప్తమైనదా? మేము పుల్లియాకులము లెక్క యేమిటి—

రాణి—నాథా! మీకధైర్యము పుట్టినా మనము నెగ్గలేము. నేనేమో యాడుదానను గనుక—

రాజ—దేవీ! యిపుడు నీకును నాకును భేదమేమి?

ఉ. బాహుబలంబు చూపి యిరువాగును రా సమరంబొనర్ప ను
త్సాహము లేదు, కారణము సత్కవివాక్యము, పోకయున్న నా
సాహిణిమారుఁడేనియును సాహసికుం డల రాయ లేనియుఁ
దోహలులై పరాభవముతో వెడలింతురు నిక్కమింతయున్.

రాణి—మఱియింకఁ బదివేల! అష్టసుఁట్టిబలశాలి బ్రతికియుండిన సుఖములు పడయవచ్చునని పల్కినాఁడు. సమయవిశేషము.

రాజ—సమయాసమయము లెంతటి ధైర్యశాలికినిగలవు. శ్రీకృష్ణుఁ డిరువదిమూఁడుమాఱ్లు రాజుతో నోడిపోయెను. మన లెక్కయేమి? రామా! మాయిరువురవస్త్రభూషణములను నీవుభద్రపఱుపవలయును. మాకు రెండు మలినవస్త్రములందెమ్ము; క్షణకాలములో నన్నిపనులను గావలయును (అనినగలొల్చుచున్నాఁడు.)

రాణి—(భూషణములందీసి కన్నులకద్దుకొనుచున్నది.)

రాము—(మలినవస్త్రములందెచ్చి) ఆహా! హారిశ్చంద్రునకు నక్షత్రకునివలె-మీకు నేను-

రాజ—నక్షత్రకుఁడేమియుపకారమొనర్చెను?

(రాజును రాణియు నిరలంకారులై మలినవస్త్రములం దాల్తురు.)

రాము—హా! నాయేలినవారా! నాకన్నులు దించుకొనిపోవేమి? నేనేమిచూచుచున్నాఁడను. కాలవైపరీత్యము! గుఱ్ఱిగ్రిచ్చకాయలం తలేసి కన్నులుండి- నేనేమిదురదృష్టశాలిని-

రాజ—ముందు నీవీకన్నులతోనే మమ్ము మేలుగాఁ జూచెదవులే.

రాణి—చాలును. విచారముడుగుము అన్నిటినిమూటగట్టుము.

రాము—(మూటగట్టి) ఇది నాపాపపుంజముమూటగాని మీ మీభూషణములుగావు. ఓ యాభరణములార! మిమ్ము నేనుభరింపఁజాలను. ఇంక నాచే మీ రెట్టి కార్యముం జేయింపనున్నారో?

రాజ—(రాణితో) పండ్లన్నియుఁగోసివైచినను సహకారలత స్వభావసుందరము-

రాణి—వర్ణనమునకిది యవసరముగాదు. విధివశమును వర్ణించుటకు—

రాము—(మూటనెత్తిని బెట్టుకొని) నాకేమిసెలవు?

రాజ—రమ్ము రమ్మింకను గొంతచెప్పవలసియున్నది.

రాము—ఓనానిర్భాగ్యపుఁ జెవులార! మీరిన్నిదినములున్నం దుకు మీకుఁదగినశిక్ష యింకనున్నదఁట (రాజుతో) మీజీర్ణ మలినవ స్త్రములు, నాకీరాత్రివేళఁగూడ మీశరీరములఁ జూడనొప్పకున్నవి.

రాజ—అజ్ఞాతవాసమున కిట్లే యుండనిమ్ము.

రాము—ఇదియును నాయదృష్టమహిమయేనా?

రాణి—మనయందఱది సమానాదృష్టమె.

రాము—నేనంతటి యదృష్టవంతుఁడనేని మీతో వెన్నాడి యే వత్తును. పైఁగా నీభూషణాదులను గాపాడుట యొక్క కష్టతరకా ర్యము.

రాజ—దీనిచే నీవు మాకంటె గొప్పవాఁడవు.

రాము—మీయెంగిలికూడుదిను కుక్కకంటె హీనుఁడను.

రాజ—ఓర్చుకొమ్మోర్చుకొమ్ము-కాలమతిక్రమింపరానిది.

రాణి—మాటలకెడలేదు- నడచుచుఁజెప్పుకొందము.

రాము—తల్లీ! నీకెంతటి ధైర్యముపట్టువడినది?

రాజ—బ్రహ్మభేద్యముగానుండవలయునుజుమా!

రాము—మహారాజ! ఏవిషయము?

రాజు—ఈవిషయము (చెవిలోఁజెప్పును.)

రాణి—రండు రండు. చుక్కపొడిచినది.

రాజ—ఇపుడు మనమీదికనున్న పర్వతమెక్కి దిగవలసియు న్నది. వనప్రదేశములోనే మనకుఁ దెల్లవాఱవలయును.

(పరిక్రమించుచున్నారు.)

రాము—(ప్రవేశించి) అద్దిరా! ఆరంభశూరత్వము! ఆయమ్మ మహారాజుకంటె ముందే పర్వతగుహలుదాటి పొదలుసొచ్చి యీప

మకుమీఁదినుండి యాపమకుమీఁదికి సింగంపుఁబెంటివలెఁ జివ్వునదాఁటి రాజువిచారము కొంతతగ్గించినది. "భార్యాసమేతుఁడై యున్న వానికెంతలాపదలయ్యును నెఱుకపడవు"— మంత్రిపై దోసమారోపింపరాదు. ప్రజలయదృష్టము—ప్రజకేమి— సేవకులది—అట్లనవలదు. సేవకులకెప్పుడును దుక్కిపెద్దదే శాంతరమే. మంత్రియదృష్టమే మంచిది కావలయును. సరి; యావిచారముకంటెనీవిచారమెక్కుడుగా నున్నది. వారివస్త్రములను భూషణములను మూటఁగట్టి యాక్రింద జాగ్రత్తగా ఱాతిచాఁపలలోఁబెట్టి పూడ్చిపెట్టితినిగాని యానిక్షేపమునకై నాకు ధైర్యముచాలకున్నది—ఒకరిసొమ్మును గాపాడుట బహుకష్టము. ఒకక్షణమైన నేనెందును గదలిపోవుటకు మనసొప్పకున్నది. ఎవరికిఁ దెలియును—పెట్టినవాఁడెఱుఁగునురా నిక్షేపము—అనియితరులకుఁదెలియకపోయినను మమ్మున్ని బాధలకుఁబాల్పఱచిన పరరాజులనిర్జించుదాఁక—నాస్వామిభూషణములను—వారు మరలఁదాల్చుదాఁక—నాకునిద్రపట్టను. ఇన్నిదినములాయుర్దాయమిచ్చిన మాలదైవము నాకంతవఱకు సీయదా! ఈయకున్న నంతకంటె మాలదైవము జగంబునఁగలదా! విద్యుత్ప్రవాహమువలె నాబుద్ధి యింతలో మూఁడులోకములు దిరిగివచ్చినది. ఎంత వెదకినను వేఱొకయుపాయముకనఁబడలేదు. పురముసొచ్చుటకుఁబాలుపోదు (ఆలోచించి)సరియే; యిప్పటికి వారడవిదాఁటి యేపల్లెయోఁచొచ్చి—ఎండకు-వానకు—ఇల్లా, వాకలియా-వారు పాపము, పంచలఁబడియుండ నేనూరుచొచ్చిసుఖపడవచ్చునా? వారిని మరల సింహాసనమెక్కింపవలయును. లేదా నేనిక్కడనే నశింపవలయును; మహారాజనినట్లు పెద్దల యాశీర్వచనబలముండెనా పండితవాక్యము సహాయముగ నాకట్టియదృష్టము పట్టుభాగ్యమునకుఁ దగిన యుపాయము నాకిక్కడకే వచ్చితోఁచును. కావున నేను సన్యాసివేషమున నీనిక్షేపముపైఁగూర్చుండి కొంగజపము చేయుచుందును. నాపరిచర్యకై

వచ్చునెవ్వరివలననైనఁ బరరాజవృత్తాంతము తెలిసికొందును. ఈడాంకలు, వృక్షములు, నన్ను రక్షించును. ఒకనాఁడు రెండునాళ్లుగాని పది మందికిఁ దెలిసినపిమ్మట నెవ్వరోకాయగసరుల దెచ్చిపెట్టెదరు. ఇంటికంటె గుడిపదిలము-ప్రాణరక్షణముకంటె నీరహస్యరక్షణము తలకుమించి నబరువైనది. (పరిక్రమించును)

(చెట్టుక్రిందనొకసన్యాసి-యిరువురు పురుషులుప్రవేశించుచున్నారు)

సన్యాసి—(కన్నులు మూసికొని కూర్చుండును)

ఒకపురుషుఁడు—(చూచి) ఎవ్వరు! ఇక్కడనొకక్రొత్తమాని.

సన్యా—(తనలో) అయ్యో! నాక్రొత్తమానివేషము వీఁడు కనిపెట్టెనా?

రెండవపురుషుఁడు — ఈతఁడు క్రొత్తమానిగాఁడు - పురాణముని.

సన్యా—అమ్మయ్య! ఈపుణ్యాత్ముఁడెవ్వఁడో వానిమతి త్రిప్పివేచుచున్నాఁడు. వెఱ్ఱినమ్మకమేగాని పరిశీలన మెఱుఁగనివాఁడు!

ఒక—ఈయుద్ధమునకు ముందీ చెట్టుక్రింద నెవ్వరును లేరు.

రెండ—ఈయన నిట్లుండనిమ్ము; యుద్ధముగొడవయెత్తినావు-కొంచెము చెప్పుము.

ఒక—చప్పగాఁ జల్లాఱినది.

రెండ—ఎవరుగెల్చిరి; ఎవ్వరోడిరి?

ఒక—గెల్పునకేమి, యోటమికేమి—మామహారాజు దేవీయుతుఁడై యేసహాయముననో కోటవిడిచి తప్పుకొన్నాఁడు.

రెండ—తెఱచినిలు కుక్క సొచ్చినది.

ఒక—కాక—పరాక్రమమూ బండలా!

రెండ—అంతటి కళింగరాజుపై నెత్తివచ్చుటే పరాక్రమము.

ఒక—ఒక్కఁడై వచ్చిన నట్లే. అసూయచే—

రెండ—సాయము దెచ్చుకొన్నాఁడా? ఎవ్వరు తోడువచ్చిరి?

ఒక—రాయల పరివారమఁట.

రెండ—రాయలని—ఏరాయలు?

ఒక—చరిత్రాత్మకవిషయము నన్నడుగకుము. కవుల విషయము రాజులవిషయము నగాధము. ఒక్కదానికి నిజమైన చరిత్రము దొరకదు. వారు వ్రాసికొనలేదు—మనకుదొరకదు. దీని కేదో వెత్తిమొత్తిగాఁ జెప్పెదనుగాని—

రెండ—సాహిణిమారుఁడను సందేహమా? నిజమే. సాహిణిమారులిద్దఱు- నన్నయ్యలిద్దఱు- భీమన్నలెందఱో—నాగవర్మలిద్దఱు. ప్రతిభాషలోనిట్లేనఁట—

ఒక—అగమ్యగోచరము! కన్నులయెదుటనున్నవారిని మన మెఱుఁగము. గ్రంథములలోనివారిగతి—

రెండ—సరిసరి. యెవ్వరో యొకసాహిణిమారుఁడిపుడు రాజు.

ఒక—అయ్యో! వానియహంభావము చెప్పనలవికాదు.

రెండ—నడుమంత్రపుసిరి కహంభావమేలాంఛనము.

ఒక—ఇదియెంత కాలము!

రెండవ—ఏమో నీయాశీర్వాదము.

ఒక—తన్నుఁదాఁబొగడికొనినఁ దన్నుకొనినట్లే.

రెండ—ఒకరినినిందించిన నుఱివెట్టుకొనినట్లే.

ఒక—అదియె చమత్కారము.

రెండ—చెప్పుము చెప్పుము.

ఒక—గంగుల ప్రభుత్వముగాదిది- కాళింగుల ప్రభుత్వముగా దిది. అనియెత్తిపొడుపులఁట.

రెండ—గంగులదెబ్బచవిచూచియున్న నట్లనువా?

ఒక—మామహారాజే జీవించియున్న నెప్పుడో రుచి చూపించును.

రెండ—ఎక్కడనో సమయమునకై వేచి జీవించియేయుండును.

ఒక—నీమాటచల్లఁదనమున—(మానింగాంచి) ఈమహాత్ముఁ డేల యీదుష్టభూమిలోఁ గాలు పెట్టినాఁడు?

రెండ—దుష్టులకు బుద్ధిచెప్పుటకేమో!

ఒక—మాటలాడఁడు—బుద్ధియెట్లు చెప్పును. వీనినాదరించుస్వభావము దుష్టులకెట్లుగల్గును.

రెండ—అట్టియపుడే సులభముగాఁ జెప్పవచ్చును

ఒక—వానియొద్ద నొక భక్ష్యమున్నది. నోటికందింతునా?

రెండ—అందిమ్ము-తినినచో నేను విసరెదను.

ఒక—(భక్ష్యము నోటఁ బెట్టును)

రెండ—(విసరుచున్నాఁడు)

సన్యా—(భక్షించుచున్నాఁడు)

ఒక—ఎంతవఱకునిజమో-కొందఱుమానులు నిత్యమునుగంగాస్నానము చేసివచ్చెదరఁట—

రెండ—చెప్పలేము. అయియుండును. వారొకరుమెత్తురని మెచ్చవలెనని వినోదములు చూపరు. వారిని నిందింపనేల?

ఒక—అట్లనకుము. కొందఱు గంటలో నూఱుమందికి వంటచేసినాఁడనిన— బియ్యముకడుగుట కెంతకాలము— ఉడుకుట కెంతకాలము— అన్నినీళ్లు పొయ్యిమీఁద నెంతకాలమునకుఁ గాఁగునని లెక్కలువేసి కుళ్ళంకలు చేయుదురు.

రెండ—రాఁబోవు కాలము కుళ్ళంకలకాలమేకాని—చేతనైనవాఁడొకఁడును పనిచేయు కాలముగాదు.

ఒక—చేసినవారిపై నాక్షేపణము— మంచికాలమే.

రెండ—సమర్థులాక్షేపించిన నది వృద్ధికేమూలము.

ఒక—ఈసన్న్యాసి మాకళింగంగు నాస్థానములో నుండఁదగినవాఁడు

రెండ—ఆయన యిప్పు డెక్కడనున్నాఁడో. ఎట్లున్నాఁడో.

ఒక—వారితోఁగూడ కాముఁడను సేవకుఁడొకఁడు—

రెండ—వారి నేపహాలనైనఁ గూర్చుండఁబెట్టి యుపచారము చేయుచుండవచ్చును—

సన్న్యా—(తనలో) ఈనిర్భాగ్యున కంతటియదృష్టమా.

ఒక—(చూచి) ఈయన మొగము చిన్నఁబోవుచున్నది.

సన్న్యా—(తనలో) నానిష్ఠ చెడుచున్నదేమో—కానిమ్ము—సంతసించెదను.

రెండ—(చూచి) ఈయనముఖము వికసించుచున్నది. మహాత్ముల వినోదములు.

ఒక—కావుననే వారి శరీరయాత్ర యనుకూలముగా జరిగి యాహారము నోటికడకు వచ్చును.

సన్న్యా—(తన) కడుపులోనికే పోవును.

రెండ—ఈయనకుఁ బ్రదక్షిణము చేసికొని పోవుదమురమ్ము; ప్రొద్దెక్కినది. ఇంకొకసారివత్తము.

ఒక—ఈరాజు ప్రభుత్వమున నాకు రాత్రియుఁ బగలును దెలియుటలేదు. ప్రొద్దుమాటనే మఱచితిని.

రెండ—నీకంతశ్రమముగానున్నదా?

ఒక—నాకే కాదు—దేశమునకంతకును.

రెండ—దుష్టపరిపాలన మిట్లేయుండును.

ఒక—ఒకదానికి నా కొడలు మండుచున్నది.

రెండ—దేనికి?

ఒక—ఈనడుమఁ బగటివేసగాండ్రువచ్చిరి. పొట్టకై కొన్ని వేసములు వారు వేసిరి. ఒక్కనాఁ డొక్క బక్కకోమటి వేసము—ఒకనాఁడు బోసిబ్రాఁపని వేసమును దాల్చి రాజదర్శనమునకు వచ్చిరి.

రెండ—మెచ్చి యేమియు నిచ్చినాఁడా?

ఒక—ఇచ్చినచో వాండ్రు సంతసించుచుఁ జెప్పుకొనరా ?

రెండ—ఈయకున్నను జెప్పుకొనుచుందురు.

ఒక—నీవును నేనును గాము. రాజుగదా!

రెండ—ఏమనియెను—డబ్బీయనివాఁడు ముందుపడవలెనొక్కను.

ఒక—నీవు రాజకళింగగంగు వేసమును దాల్చి వచ్చితివా, బహుమానమిచ్చెదనని పంపివైచెను.

రెండ—వారెట్లు సమ్మతించిరి?

ఒక—వారిదర్శన మెన్నఁడును జేయలేదు. జీవించి యున్నవారి వేసములు వేయుట మావృత్తికి భంగమని చెప్పినారు.

రెండ—రాజేమిచేసినాఁడు.

ఒక—అతఁడు మృతప్రాయుఁడే—(నోరుమూసికొనును)

రెండ—ఆహా! ఇట్టిమాటలు పరులనినను మనమనుకరింపరాదు.

ఒక—శాంతము పాపము!

సన్యా—(తన) ఓరోరి మూఢుఁడా! నీవురామృతప్రాయుఁడవు. మారాజు సాహిణిమారునకు మారటమిత్తిరా.

ఒక—(చూచి)చూడుమీయనముఖమెఱ్ఱవాఱుచున్నది.

రెండ—మనమాటలు వినియెంగాఁబోలు.

సన్యా—(దుఃఖమును సూచించును)

రెండ—చూడుము! దుఃఖించుచున్నాఁడు. మునీంద్రులకు సుఖదుఃఖములు లేవందురే.

ఒక—లేకపోవుగాని, సుఖదుఃఖములు సమానమందురు.

సన్యా—(తన) నేను మూనినైనప్పుడుగదా. మీరెవ్వరో వెఱ్ఱివారు! నేను మీరనుకొనినంతటివాఁడను గాను. కానిండు, మీసంభాషణము నాకుఁ బనికివచ్చును. (నవ్వ గనఁబడుచును)

రెండ—తర్వాత నేమి జరగినది?

ఒక—కళింగగంగురూపమిది యని పటముం దెచ్చిచూపెను.

రెండ—పటముం గాంచి వేషము వేయు తెలివి వీరి కెక్కడిది?

ఒక—ఇంకొకసారి దర్శనమునకు వచ్చునప్పుడు సిద్ధముచేసికొని వత్తుమని చెప్పిపోయిరి.

రెండ—గర్వోక్తులు—భంగకారణములు—రమ్ముపోవుదము. ఈమునిసంగతి యేమిటి—విడిచిపోదమా—పూర్వాశ్రమములో వీని నెక్కడో చూచియుంటిని.

ఒక—నీవు రాముఁడనుకొనుచున్నాఁడవు.

రెండ—అచ్చున దింపినట్లున్నాఁడు.

సన్యా—కోపమునిఁగినదిగదా!

ఒక—ఆమహారాజెందో పోయినాఁడని విరక్తిచే నిట్లున్నాఁడా! ఊః—పగదీర్చికొనఁ జూచునుగాని యిట్లూరకుండఁడు.

సన్యా—మీకడుపుచల్లగాఁ దేల్చిపోందు. కర్ణరసాయనములగు మీపలుకులు విని నన్నధోగతి పాలుచేయకుఁడు. దుష్టనృపాలునకుఁ దెలిసెనా చిక్కులు పెట్టును

రెండ—ఏమనినను మంచిదే—వాని నోటిలోనుండి యూడిపడినాఁడు.

సన్యా—నీకడుపు కందపెరడుగాను—నీవెవ్వఁడవో నాప్రాణము మీఁదికిఁ దెచ్చులాగున్నావు.

ఒక—రాముఁడు కానేకాఁడు—అతఁ డేమూలనున్నాఁడో రమ్మురమ్ము—మనదారిని మనము పోవుదము

రెండ—అగును. వాలికిట్లు ముక్కుమూసికొని కూర్చుండు సమయమా యిది!

సన్యా—(తన, మీరావలకుఁ బోయితిరా నేనిందుండి లేచిపోదును. నాయనలారా! లేచిపోదును. తెప్పల సందున నుండి మిమ్ముఁ జూచి యూసవాలు పట్టినాఁడను. మీమేలు మఱువను. బాబులారా! పోండు. మీరు వేత్రహస్తులు—మీ ప్రయోజనము పగటివేసములనాఁడు నాకుఁ గలదు.

ఒక—రమ్ము—రమ్ము—

(నిష్క్రమించుచున్నారు)

—ఇది చతుర్థాంకము.



# కళింగగంగు

## పంచమాంకము.

(రాముఁడు ప్రవేశించుచున్నాఁడు)

రాము—వీరియిండ్లు వేయిండ్లకు మొదలగుఁగాక! వరహాలకెత్తు కెత్తయిన మాటలు చెప్పినారు. వారట్లుపోఁగానే నాకొంగజపమొకమూలకు నూకినాను, (నవ్వుచు) చూచినవారందఱును ఏ భూతమునో, దయ్యమునో గాజుకుప్పెలోదింపి యిక్కడనెవ్వరో భూతవైద్యులు స్థాపనచేసినారనుతలంపున నక్కడకు వచ్చినవారెల్ల భయపడులాఁగున నగలపాఁతుమీఁద ఱాళ్ళుగుట్టగాఁ బోసినాను. చూచినవారందఱుఁ జెఱియొకఱాయి, తలకొక చింపిగుడ్డ దానిమీఁదఁ బడవైతురుగాని తప్పరు— అబ్బ! నాకాళ్ళు ఱాళ్లవలెఁ బరువెక్కినవి. పట్టుదలచేతనే గాని యెన్నఁడు నిన్ని క్రోసులు నడచినాఁడనా, ఎంతనడచినను దఱుఁగదు. ఆసుకుమారులెట్లు నడచినారో! నేనొకవేళ దారితప్పితినా, లేదే! యిది భీమమండలమే. మొన్నరాతిరి చెందుర్తిమఠములో నిద్రించితిని. నిన్నదాటినది యేలేఱు- నేఁడిదిగో సాగరసంగము కడనున్నాఁడను. ఆమహారాజు చెప్పినట్లు వేములవాఁడలు పెక్కులుండవచ్చును. పేరులునూరులు నొక్కరీతిగా మనుజులనేకులుండవచ్చును. డాక్షారామము ప్రాంతమునఁ గలవేములవాడకే పోవుచుంటిని. భీమేశ్వరు

లేఁదజైననుండవచ్చును. "ఘనుఁడన్వేములవాఁడవంశజుఁడ దాక్షారామ భీమేశనందనుఁడన్" అనిభీమకవి చెప్పికొనినట్లు నన్నీ వేములవాడకే గదా, రమ్మని చిట్టిచిప్పరఁ దెల్పినది. భీమకవులనేకు లుండవచ్చును. కాని భీమేశముకొడుకు భీమకవి మనకుఁ గావలయును. నన్నియభట్టారకునినాఁటికి మురారికవినాఁటికి సీభీమేశ్వరుఁడు ప్రసిద్ధుఁడు—రాజుగారన్న మాటలేగాని నేను నానోట నుచ్చరించితినా—బెస్తవాఁడు సంస్కృతశ్లోకములు నాటకములోఁబఠించినట్లుండును. అయినను—నేనందును—విభీషణుఁడు శ్రీరామలక్ష్మణులతో, సీతామహాదేవితో "ప్రణమ్యతామయమాంధ్రవిషయలక్ష్మ్యాః సప్తగోదావరీనా హారకలాపైకనాయకో భగవాన్ భీశమ్వేరః" అని చెప్పినాఁడఁట—యీప్రదేశమును గూర్చి—వారుచెప్పినట్లు మొన్న నే శివరాత్రి గడచినది. ఎక్కడఁ జూచినఁదట్టులు—గోడిగలు—రాజయోగ్యాశ్వములు—సామ్రాణులు—కన్నుల పండువుగానున్నది—ఇప్పటికిఁ గోటిఫలి, ముక్తేశ్వరము, ద్రాక్షారామము సేవించి వేములవాడకుఁ జేరియుందురు. ఈరాత్రి వారిని, గలసికొందునా? ఇంతకు నామహాకవి యూరనుండవలయును. (నిష్క్రమించును)

(ప్రవేశము—రాజు-రాణి—భీమకవి)

భీమ——(వర్ణించి)శుక్లపక్షప్రారంభము కావున మఱియును—రేజీఁకటివానికన్నులట్లు—తొలుతఁజిమ్మచీఁకట్లు—అయ్యో! మాటల వెంబడిని మఱచితిని—గోవిందా ! మాయమ్మ రొట్టె తినకుండ నాకై కాచుకొనియుండును. నేనేగెదను. (కేకవైచి నడచుచున్నాఁడు)

(తెరలో)

ఒకరు——గీ. మగువ యెందుంటివో రాకు మాను నిలుము!
యిచట గోతులు చీఁకటి-

రెండ——(పడి) యేమి నాథ

గోయియని ముందెచెప్పినఁ గొంతమేలు
గాదె గోతను బడితిని గాలు నొచ్చె.

భీమకవి—(విని) ఎవ్వరది? ఆఁగఁడియు మంగఁడును చీకటిలో-

రాజు—(ప్రవే)

గీ. అల్లుఁడా పల్లి కొండ యన్నట్టులయ్యె
నయ్యయో కాలునొచ్చెనే యతివ! కాలు
దివ్వటీ లేక యెన్నఁడు దిగవు పీక
మట్టినీవిట్లు నాతోడనైతివిగద.

రాణి—కాలునొప్పికేమి- మంటిచిప్ప చిదికినది. త్రేపటిగతి-

రాజు—నేఁటిగతి చెప్పుము.

రాణి—నేఁటి రాత్రికిఁ గడుపులోఁ గాళ్లుపెట్టికొని పండు కొందము.

భీమ—ఎవ్వరువారు- చీకటిలో నాకెదురువచ్చుచున్నారు. ఢీ డిక్కులు కొట్టుకొందుము- ప్రాతగోతులున్నవి.

రాజు—ముందుగోయి— వెనుకనూయి-ఎవరయ్యా చీకటిలో- మాగ్రహచారము- క్రొత్తయూరు- చీకటి-

భీమ—నీవెవ్వరు?

రాజు—మీరెవ్వరయ్యా! బ్రాహ్మణవీధి యెటువైపున-

భీమ—నీపేరెవ్వరు?

రాజు—నే నూరును బేరును మాసిన నిర్భాగ్యుఁడను.

భీమ—ఏల యిట్టి నిస్పృహ- మీరిద్దఱెవ్వరు?

రాజు—మేము వేములవాడభీమకవిచేసిన జోగులము.

భీమ—అతఁడేమిచేయును! దైవవశము- రాజకళింగగంగువా?

రాజు—మీకొకనమస్కారము; ఆమాటగట్టిగాననవలదు. మా కై విరోధులు తంత్రములుపన్నుచుందురు-మీరెవ్వరో చెప్పినారుకారు,

భీమ—ఇట్టియపఖ్యాతికి నిమిత్తమను... కావునఁ బేరు చెప్పఁ
గొనరాదు.

రాజు }
రాణి }—మహాకవీంద్ర! ఎందున్నారు! ఏవీ మీపాదములు.

భీమ—రండురండు. నడువీథిలో నీప్రసంగమేల? నాజాడనుబట్టి
యెడమప్రక్కగా రండు- ఇదె మాయిల్లు-

రాణి—ఆపదకడ్డువచ్చిన దైవమునకు నమస్కారము. మిమ్ము
ను మన్ననుదెగియని యీరాత్రిమాకొఱకే యింకను జంద్రోదయము
కాలేదు.

భీము—గోవిందా! దీపము దీపము.

గోవిం—(దీపముం దెచ్చుచున్నాఁడు)

భీము—(సమీపించి) ఇటురండిటురండు. మాయిల్లిది. (రాజుం
గాంచి) అట్టిమహారాజున కిట్టి యవస్థ యెవ్వఁ డెక్కడ వ్రాసెనో.

రాజు—బ్రహ్మకల్పుఁడైన కవీంద్రుఁ డొకపద్యములో-

రాణి—కవీంద్రా! విధి నొసట వ్రాసినాఁడు.

భీమ—అమ్మా! పండితవాక్యమని నీవనఁబోవుచున్నదానవు.

రాణి—ఎవ్వరనఁగలరు?

భీమ—నేను నిమిత్తమాత్రుఁడనైనను మిమ్ముఁజూడ నాకు
సిగ్గుగా నున్నది.

రాజు—సిగ్గువిడిచి మేమే మీయొద్దికి వచ్చితిమి.

రాణి—మీయట్టివారు మాయూరేలవత్తురు! వచ్చినపు డనా
దరణము చేసిన సిగ్గు మాది. మీకేలసిగ్గు.

భీమ—మీరు కడు బడలియున్నారు. పిమ్మట మాటాడుకొంద
ము. ఈయమ్మకాలు నొప్పితీరువఱకు మాయింట నుండవలయును.

రాజు—మీమాటలతో మా బడలిక తీరినది.

రాణి—నా కాలునొప్పి యంతగా లేదు.

భీమ.—గోవిందా! (అని సంజ్ఞచేయును)

గోవిం—చిత్తము—(అనిపోవును)

భీమ— (వారిం గూర్చుండసియమించి) కాలము, కర్మముం గూడినవి.

రాజు—మిమ్ము నిందించినామనుచింత మానవలయును.

భీమ—నీవూరకున్నను లోకమూరకుండదు గదా.

రాణి— చంద్రుఁ డస్తమించుచుండఁగా రాత్రిని నిందించుట యేల?

భీమ—సాహిణిమారుని యేల్బడి యెట్లున్నది?

రాజు—మాయునికిఁ దగినట్లున్నది.

భీమ—అగును; నేను దలఁచినట్లే యుండును.

రాజు—నాపరివారము కకావికలయ్యెను.

భీమ— కానిమ్ము కానిమ్ము.

గోవిం—(ప్రవేశించి) లోనికి దయచేయవచ్చును.

(తెరలో)

సుందరీ! సుందరి! అమ్మగారి నిటు దీసికొనిరమ్ము.

రాజు } —(లోని కేగుచున్నారు.)
రాణి }

భీమ—(వెనుకన పోవుచున్నాఁడు)

రాజు— (ప్రవేశించి) వీరియాదరణమున నా యాయాసము తీఱినది.

రాణి—(ప్రవేశించి) అన్నరసముకంటె నాదరణరసము మేలు—

(తెరలో) అయ్యలార! అయ్యలార !

భీమ—(ప్రవేశించి) ఎవ్వరది?

రాణి—రాముని కంఠమువలె నున్నది.

రాజు—రాముఁడే-రాముఁడే. పండితోత్తమా! ఆపిలుచువాఁడు నాపరిచారకుఁడు.

భీమ—అట్లా! అయ్యో! అబ్బీ! రా! రా!

రాము—(ప్రవేశించి అందఱకు మ్రొక్కుచున్నాఁడు)

రాజు—ఎల్లవారు సుఖులెగదా.

రాము—మీరిందు సుఖులరై యుండుటచేత-

భీమ—అబ్బి! నీవెట్లు వీరిక్కడనున్నారని తెలిసికొంటివి?

రాము—పెద్దలయాశీర్వాదమును నాయమోఘ స్వామిభక్తియును దెలిపినవి.

భీమ—(లేచి) రండు రండు. అవ్వల సంభాషింతము-

(అందఱును బరిష్క్రమించుచున్నారు)

భీమ—(ప్రవేశించి) రాజా! మొదటనే చెప్పితిని- నన్ను నిందింపవలదని-

రాజు—మీకంటె మొదటనే చెప్పితిని- అది నాకర్మమని-

రాణి—ఇప్పటి యాదరణముం జూడఁగా మీకెట్టికోపమును లేదని తెలిసినది.

భీమ—చక్కఁగాఁ జూచితిని. నీకు సింహాసనయోగమున్నది కావుననే నాఁటిపద్యము కొంతభావిని సూచించినది-

రాజు—ఈయజ్ఞాతవాసము నాకెంతకాలము?

భీమ—సూర్యుఁడు మీనమునకు రావలయును- నీకు భయము లేదు.

రాణి—పండితోత్తమా! నాస్థితి యెట్లున్నది?

భీమ—వెఱ్ఱితల్లీ! తాఁడుతో దబ్బనము.

రాజు—(తనలో)ధైర్యము చాలక యడుగుచున్నది-(ప్రకాశ) నన్నుఁ బట్టి నీస్థితి యుండును.

రాణి—మనస్సమాధానమునకై యడుగుచుంటిని- గూడా ముష్టి యనుసామెత రాదుగద!

భీమ—మీరు సింహాసనమునఁ గూర్చుండినపుడు వచ్చెదను- అపుడు నన్నడుగుఁడు.

రాము—అయ్యగారు! మా కేదిక్కున జయము?

భీమ—వెఱ్ఱివాఁడా! మీముక్కునకుఁ దిన్నగా జయమున్నదిరా.

రాము—మహారాజ! ఆజ్ఞఁగొనిరంకు- తెల్లవాఱువఱకుఁ గొంతదూరము నడువవచ్చును-

భీమ—మహారాజ! ఈరాముఁడు చెప్పినట్లొనర్పుఁడు.

చ. మిము నిటు చేసినాఁడనని మీరు తలంపకుఁడయ్యలార! మీ
సుముఖత మిమ్ముఁ బ్రోచు నతి శూరునకేనియు నొక్కచోట వ
చ్చుమగత! మీరుగర్వము మునుంగువడున్ మిముఁబొందుమేలు మీ
క్షమకుఫలంబు గాంచెదరు సంతసమందుచుఁ బొందు వీటికిన్.

రాజు—అంతటివాఁడనైన- ఈరామునే పంపెదను.

భీమ—కాకిచేఁ గాగితమంపుము-మీరు పిలువనేల; అంతదాఁక నిలుతునా.

క. లోపంబు లుండవచ్చును
భూపాలుండన్న లోపములపుట్టయె యా
పాపికినిదోము బల్విడిఁ
గాపురుషులు బాఁపరింత్రు క్షమియింపఁదగున్.

భీమ—రాజేంద్ర! ఆనమయ మట్టిది. నీవెవ్వరి ననవలదు.

గీ. అనుభవము తక్కు- వాస్థాను లనవరతము
దిరుగువానికిఁగాక నాతెలివిక్షపుడు
గర్వమలమినకతన నీకష్టసుఖము
లేమి యెఱుఁగను గోరిత్తగదా మహేంద్ర.

రాజు—పండితులకుఁ గొ్రత్తవిషయమెక్కడ.

రాణి—అనేకపండితులకోష్ఠినుండు వారేమిచేసినారు.(రాజును జూచును)

భీమ—నాజ్యోతిషమును బట్టి నాకంతెను దొందరగల నాశిష్యులు కొందఱు బైలువెడలుదురని తోఁచుచున్నది.

రాజ—(తనలో)వారెట్టివారని యధికప్రసంగము చేయఁగాదు?

రాణి—(తన) ఇట్టివి వారే చెప్పవలయునుగాని యడుగరాదు.

భీమ—దాఁచినంత నెపోవునా? ఎల్లవారికిఁ దెలియఁగలదు.

మ. కవియన్నంతనెయేమి యూడిపడెనా గర్వోద్ధతుల్గాక;యొ
క్కవిశేషంబునులేదు, దేహియని డొక్కల్ తెక్కలుం జూపకు
న్న వరాడబ్బులురావు;ముష్టియిడ రెవ్వారు లోకు లుర్వీశులే
కవికాధారము;నూటనాటగలరాజ్యోర్భర్తలుందాతలై.

అట్టిచో, మెప్పించి కడుపులోనియన్నము తీసికొని తినక గర్వించి మిట్టిమీానై పడుచుండుదురు.

రాజ—కవులకే గర్వముండవలసినది.

భీమ—కవులమని విద్వాంసులమని గర్వించుటకాపుట్టినది. చదివినవానికే శాంతములేకున్న—

రాజ—అది గర్వముగాదు. స్వసామర్థ్యప్రకటనము.

రాణి—ఏలయీామహాత్ముఁడన్యాపదేశమున నాత్మనింద.

భీమ—ఆత్మనిందగాదు. అందఱు నెఱుఁగియుండఁదగినవిషయము.

రాజ—దేవీ! నిజముగా నిది యట్టిదియే.

రాణి—మీారు చెవియిచ్చి వినుచున్న- కవిగాన వర్ణించుచున్నాఁడు.

రామ—అనుజ్ఞఁగొనుఁడు పోదము.

భీమ—మీమనస్సులిక్కడ లేదు. నాపురాణము కట్టిపెట్టెదను.

రాజ—మాపైఁ గరుణయుండనిండు.

రాణి—మీపుత్రికపైఁ గరుణయుంపుఁడు. (వెనుకకుఁజూచి) అమ్మా! ఉందునా.

(తెరలో-అమ్మా! బొట్టుంచుకొనుఁడు.)

రాణి—(పరిక్రమించి—కుంకుమ గళమున, మంగళసూత్రమున నంటించుట నటించుచువచ్చును.)

రాజు—కవీశ్వరుని భార్య శుభశకునముం దెల్పినది. రామా! దారిచూపుము.

భీమ—"యశ్శివోనామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా
తయోస్సంస్మరణాత్పుంసాం సర్వతోజయమంగళమ్.
లాభస్తేషాంజయస్తేషాం కుతస్తేషాంపరాభవః
ఆపదామపహర్తారం దాతారంసర్వసంపదామ్
లోకాభిరామంశ్రీరామం భూయోభూయోనమామ్యహమ్॥

గీ. నామమున రూపమున శివుండే మహాత్ముఁ
డయ్యె సర్వమంగళయే మహాత్మురాలు
వారిస్మరియింప జనుల కవ్వారిగాఁగ
సర్వదిక్కుల శుభమును జయముగలుగు.

గీ. ఎవ్వారిందీవరశ్యాము హృదయమున జ
నార్దనుని నిల్పుదురు వారి కబ్బు లాభ
మందుదురు విజయంబును నన్నిపట్ల
వారికెచ్చటను బరాభవంబు లేదు.

గీ. ఆపదల నాపదలఁ బెట్టి సుఖలసంప
దల నొసంగెడు లోకసుందరుని రాము

మాటిమాటికిఁ గొల్తు నమస్కరింతుఁ
బోయిరండు శుభంబవి జేయులార !

(నిష్క్రమించుచున్నారు.)

——(రంగము——సాహిణి మారునియాస్థానము)——

సాహి——(పీఠస్థుఁడై) ఎవ్వఁడురా యక్కడ?

సేవ——దేవ! ఇదిగో నుంటిని——

సాహి——మంత్రి నేఁడేల యింతతడవు రాలేదు?

సేవ——దేవా! వార్త వచ్చినది— ఆకస్మికముగా రాత్రి విషజ్వరము తగిలి మూసినకన్నుఁ దెఱచుటలేదఁట.

సాహి——ఇప్పటి కెందును గళింగగంగు నడ పొడ తెలియలేదుగద !

సేవ——ఇంకను జీవించియుండునా! బ్రదికి చెడినవాఁడు.

సాహి——ఆసన్న పరిచారకుఁడు రామునుఁడు కూలికి విషముదినునా?

సేవ——వారి పాదములదగ్గఱ బ్రదికినవానికది విషప్రాయము గాదు.

సాహి——ఇవియన్నియు నీయూహలా !

సేవ——మన్నింపవలయును——నాకంతటి తెలివియా? వదంతులు——

సాహి——ఏది యొక వదంతిం జెల్పుము—

సేవ——అవధారు! దేవ! ఒక్కసారి యేలినవారిని దర్శించిన బహురూపనాటకసంఘము వారు—జీవించియున్నవారి వేసములు వేయుట మావృత్తికి భంగమని విన్నవించుకొని యున్నారు—దివ్య చిత్తమునకుఁ దేవలయును.

సాహి—జ్ఞప్తికి వచ్చినది.

సేవ—చిల్లరకొంప లెన్నిదిరిగిన లాభమేమి. రాజబహుమానముంబొందవలయునని—వారు రాజకళింగగంగు జాడలు తీసినారఁట! ఒక్కనాఁటి పగటివేళ—

సాహి—ఏమిజాడలు తీసినారు?

సేవ—దేవా! ఒక్క గుహాముఖమున నొక్క స్త్రీశవము నిద్దఱు పురుషశవములం గాంచినారఁట—

సాహి—అంతటితోఁ దృప్తి యగునా!

సేవ—ఎవ్వరో చెప్పుకొనుచున్నారు. ఆస్త్రీ చిటికెనవ్రేలి యుంగరము—దానిపైఁ బేరు—

సాహి—ఒక్కింత నమ్మవచ్చును.

సేవ—ఏలినవారు పరిశీలింపఁదగును.

సాహి—నేఁడేమి కొలువున కొక్కరును రారు!

సేవ—ఇంత కొక్కింతముందే మనవిచేయవలసినది. సందర్భమెఱుఁగక వెనుకఁ బడవైచితిని.

సాహి—అది యేది?

సేవ—ఆవేసగాండ్రు నేఁడు ధర్మశాలలో రాజకళింగగంగు వేషమును దాల్చుచున్నారని యూరంతయు నక్కడ మూఁగినది.

సాహి—కళింగగంగు బ్రదికి యుండఁగా నిది జరుగవలసినది.

సేవ—(తనలో) అపుడావంకమీఁద నిపుడీవంకమీఁద బహుమానము నున్నచుట్టునా?

సాహి—సభకుఁ దగిన పౌరుల నుచితస్థానములఁ గూర్చుండఁ బెట్టుము.

(తెరలో) జయ! విజయీభవ.

సేవ—(పలుగెత్తి) ఎవ్వరది, సెలవులేనిదే యిటురావలదు.

హాస్య—రాజసేవకునకు జయము! (వంకకఱ్ఱయెత్తి) రాజ ద్వారమునకు జయము! అడబాలవారి చిన్నవాఁడవు. రాజునొద్దఁ దల ద్రిప్పుకొనుచున్న వాఁడవు. ఎత్తెనుగంప—దింపెనుగంప—

సేవ—నన్నుఁ బొగడినఁ బ్రయోజనమేమి.

హాస్య—మీతండ్రిగారి కీర్తి మీయమ్మగారి దాతృత్వము మేమిప్పటికిని జెప్పుకొందుము.

సేవ—మాయమ్మగారి దాతృత్వమునకు, నీవు దగినవాఁడవు.

హాస్య—అట్లనెదవు. కోఁతలకాలములో వచ్చినాము. వెలగ చెట్టుక్రింద మీయిల్లు చుట్టుగుడిసె. దానిలో నీకఱ్ఱవలెఁ గోఁడెతాచు పడగ యెత్తి యాడుచున్నది.

సేవ—అందుకనియే మాతమ్ముని పేరు సుబ్బారాయుఁడు.

హాస్య—త్రోఁకకు జేనెఁడు చూచి కొట్టినాఁడను. ఆఱుణాల కోడిపెట్టను-వండుకోరా నాకొడుకా యని చెల్లమ్మతల్లి-ఇచ్చి మీరు మఱతురు.

సేవ—అట్టె నన్నుఁ బొగడవలదు.

హాస్య— దేవుని వరమున్నను బూజారివరము దొరకదు మిమ్మే పొగడవలయును.

సేవ— వేసములెప్పుడు వచ్చును!

హాస్య—ఇదిగో! వచ్చుచున్నది. వెండిబెత్తముల వారి కేకలు వినవచ్చుటలేదా!

సేవ— సెలవు పొందివచ్చెదను. (తిరిగివచ్చి) మీరందఱు వచ్చి మీకుఁ దగిన తావుల నిశ్శబ్దముగాఁ గూర్చుండుఁడు—అయ్యార్యరండు— (లోనికిఁబోవును)

(కొందఱు వచ్చి కూర్చుందురు.)

(తెరలో)

రాజకళింగగంగుమహారాజా! ఆసేతుసీతాచల విదితమహాయశా! సజ్జాపురసుధర్మాఖండలా!

సాహి—సేవకా! ఏదీ సింహాసనస్థుఁడైన కళింగగంగు పటము?

(తెరలో; విరోధిశిరోధికృంతనదీక్షామనోహరా!)

సేవ—దేవా! ద్వారముకడ వేసగాండ్రున్నారు.

సాహి—ప్రవేశపెట్టుము.

సేవ—లోనికి రండు.

హాస్య—(ప్రవేశించి) దేవేంద్రవిభవ! సాహిణిమార! జయము మారసుందరాకార! (అని మ్రొక్కును)

సాహి—వెనుక వచ్చినవాఁడవు కావా!

హాస్య—అతఁడు మా బావ; చనిపోయినాఁడు. చిల్లరవేసములు వేయునే నీ పనికి దిగవలసివచ్చినది.

సాహి—తక్కినవారు మునుపటి వారేనా!

హాస్య—రాజేంద్ర! కాలమును బట్టె మనుష్యులును మాఱుదురు. రాజవేషమువాఁడును క్రొత్తవాఁడె.

సాహి—ఏదీ ప్రవేశపెట్టుము చూతము.

హాస్య—చిత్తము (అనితాళము) పట్టుకొని తకతక తెయ్.)
తెయ్. తెయ్యాత్తా తళంగుతక.

కీర్తన— రాజు వెడలెను గంగురాజు వెడలెను
కళింగగంగు రాజు వెడలెను
వేత్రహస్తు లిరువంకలఁ గొలువఁగ—రాజు వెడలె.

(అని పాడఁగనే ఆయుధపాణియగు రాజును వేత్రహస్తులును ప్రవేశించిరి.)

సాహి—(అద్భుతపడి పటమువంకఁ జూచును.)

సభ్యు—ఆహా! కళింగగంగుమహారాజే. (అనిసభ్యులు)

సేవ—స్‌స్‌స్సు—సద్దు; మాటలాడవలదు.

హాస్య—సభాస్తారులార! మాకడుపు నిండక మేము వచ్చినాము; మామాటలు ప్రభువుగారికి వినఁబడనిందు.

రాజవేషగాఁడు—శుభమస్తు—అవిఘ్నమస్తు. శ్రీశారదాంబాయై నమః.

"హృత్వాశత్రుం నృత్యంతీచండం
సాచండీవః కల్యాణంకుర్యాత్
దేవేంద్రాద్యాః ప్రీత్యాసంప్రాప్తాః
సంసేవంతే యత్పాదాంభోజమ్.

(అని చేతికత్తి తళతళ జడిపించును)

సాహి—పాటలు పద్దెములువిని చెవులు తడికలు కట్టినవి. కళింగగంగుచర్య లేమైనఁ గనఁబఱుపుము.

హాస్య—స్తోత్రపాఠములు కొన్ని చేయకుండఁ గథవినిపించుట మాకు వాడుక లేదు.

సాహి—త్వరగాఁ గానిమ్ము.

హాస్య—గొప్పవేషములు వేయువాని నొక్క ప్రొద్దుంతుము; రాజవేషగాఁడు కడు బడలి యున్నాఁడు.

సాహి—నీవేమైనఁ గొన్ని వినోదములు చూపెదవా?

హాస్య—ఏమిసెలవు? కళింగగంగు పరిపాలనమా, పాఱిపోయిన పటాటోపమా.

సాహి—ఆలస్యమగును. అవి రేపు వినవచ్చును. రాజుచేఁ గొంత కలాపము, వీరరసము నడపింపుము.

హాస్య—చిత్తము చిత్తము. ఏలినవారినోటిలో దేవుఁడున్నాఁడు. మేము సిద్ధపడివచ్చిన భాగము నదియే; మాకు బహుమతీ దొరకును-మేఁ! పెద్దచింబోతు. (అనిమేఁకవలె నఱచుచున్నాఁడు)

సాహి—పొగడికలతోఁ బనిలేదు.

రాజువేషగాఁడు- (పీఠముపైఁ గూర్చుండఁబోవును)

వేత్రహస్తులు—జయ! రాజకళింగగంగుధరామండలేంద్రా ? పరరాజమత్తవారణ పంచాననా !

సభ్యులలోనొకఁడు—ఈవేత్రహస్తులును మునుపటివారివలెనే యున్నారు- వాఁడు గోపాలుఁడు.

రెండవవాఁడు—వీఁడు కొండఁడు.

మూఁడవవాఁడు—రాజవేషమునకుఁ బరివారము సరిగానున్నది.

సేవ—సద్దు! మాటలాడవలదు.

నాల్గవవాఁడు—నీసందడి యెక్కువగానున్నది. నీవూరకుండుము.

సేవ—(కోపముతో) ఆఁ! ఏమనుకొన్నావు. ఇది సభ !

సాహి—సేవకా! వానినావలకు గెంటు.

రాజవేషగాఁడు—(తనలో) గెంటుటయేనా మోటుఁదనము.

(ప్రకా) పా. భ్రామంభ్రామంభువనతలం
దర్శందర్శం జగదఖిలం
భూయోభూయః పరిగణితం
విష్ణోర్నామశ్రియతహితమ్.

(సాహిణిమారునివంకఁదిరిగి కత్తి యాడించుచున్నాఁడు)

హాస్య—(దూరముగా లాగుచున్నాఁడు)

రాజవేష—

మ. వివిధాస్థానములందు నాప్రతిభ యుర్వీజానులాలింపరే
కవులుం బడితులెందఱో పొగడరే గర్వాంధులౌ వైరులం
జివుకంజేయనె కాల మొక్క-గతి నిశ్చింతంబుగా సాగనీ
యవు కష్టంబులు నీసభాస్థలికి డాయంబో మెసర్వాపదల్.

సాహి—సేవకా! జ్వరతీవ్రము తగ్గినచో మంత్రిని బండిపై రమ్మని వార్త పంపుము.

హాస్య—(సంజ్ఞచేయఁగా మంత్రివేషగాఁడు వచ్చును)

సాహి—మంత్రీ! జ్వరముతగ్గినదా.

సేవ—మహారాజ! ఇది కళింగగంగు మంత్రివేషము-

సాహి—అద్భుతము! ఇది వేషమా? జ్వరముతగ్గలేదా మంత్రీ?

హాస్య—ఏలినవారి కటాక్షమున్న నీబంటెంతకైనఁజాలును.

సభ—ఒకఁడు—అచ్చముగా మంత్రియే యీతఁడు.

రెండ—వేషములన్న మాటలా! అరదళము పూసికొని దీపపుఁగ్రీనీడనెగురుటగాదు.

మూఁడ—మఱియు నిది రాజాజ్ఞ. రాజుదలఁచిన దెబ్బలకుఁ గొదవా?

సేవ— .స్ స్ స్సు-సద్దు-మాటలాడవద్దు.

హాస్య—(చేతులు జోడించి) సభ్యులార! పాటపాడుదునా? మంగళహారతిపాడితినా మీకుఁ గోపమువచ్చును.

రాజు—సాహిణిమారా!

సాహి—ఏమి యీసంబోధనము!

హాస్య—మహాప్రభూ! కథానుకూలప్రసంగము- పూఁటకు భుక్తి- ఆటకుశక్తి- పాటకురక్తి మాటకు యుక్తి-లేకున్న సభగట్టదు.

రాజు—సాహిణిమారా!

సాహి—(తలయూఁచి పటమువంకఁ జూచును)

రాజవే—సాహిణిమారా!

క. కష్టంబులు గట్టెక్కెను.

హాస్య—కష్టంబులు గట్టెక్కెను

రాజవేష—కష్టంబులు గట్టెక్కెన

నిష్టంబులు దీఱె నింక నీవెదుటఁబడన్

దుష్టుల గర్వంబడఁగెను-

హాస్య—(దానినే వెనుక పాడును)

సాహి—ఇఁక మంత్రిచేఁ గొంత కలాపము నడిపింపుము.

హాస్య-—ఏభాగమున- భీమకవి పద్యములకుఁ బ్రత్యుత్తరము వ్రాయుటకు- ఆపట్టు సెలవా?

రాజు—సాహిణిమారా !

క. కష్టంబులు గట్టెక్కె న

నిష్టంబులు దీఱె నింక నీవెదుటఁ బడన్

దుష్టులగర్వంబడఁగె న

వష్టంభము మాని యేగు స్వర్గంబునకున్

(అని పీఠము మీఁది వానిని క్రిందఁబడఁద్రోసి తెరమఱుఁగున కేడ్చివచ్చి నెత్తురుబట్టలతోఁ బీఠముపైఁగూర్చుండును.

సభ—(ఆశ్చర్యము నొందుదురు)

మంత్రి—(ప్రక్కనున్న పీఠముపైఁగూర్చుండును)

వేత్రహస్తులు—జయావిజయీభవ! జయ ! విజయీభవ:

రాజు—భటులార! మనపై వైరుల పక్షమున వచ్చిన యోధుల నందఱింబట్టి బందీకృతులం జేయుఁడు,

సభాసదులార!

క. వినలేదే వృత్తాంతము
కనలేదే స్వచ్ఛముగను గర్వోద్ధతులం
దునుముట యనేకవిధముల
వినిశ్చయంబయ్యె మున్ను పెద్దలచేతన్.

అయ్యలార!

గీ. ఈర్ష్యమై వీనిపై నెదు రెత్తినాను
కుడిచి కూర్చున్నవానిపై విడిసె దండు
కాలగతికొక్క విధమునఁ దూలి డాఁగి
యిప్పుడీగతినొనరింప నొప్పుఁగాదె.

హాస్య—(కట్టె క్రిందఁ బాఱవైచి రాముఁడై నిలుచును.)

మంత్రి—(లేచి) నాపైఁగలదురభిప్రాయము పోయినదని యభయ మీయవలయును.

రాజు—నీవేమిచేసితివి? కాలము—మనస్ఫూర్తిగా నిచ్చితిని-మఱి యింక-

మంత్రి—ఈరాముని సంగతి-

రాజు—అమాత్యవర! రాజ్యము దొరకి క్షణకాలమైనను గాలేదు. పరమోపకారియగు రాముని రాజ్యగర్వములో మునిఁగి మఱచితిని.

రాము—(కాళ్లపైఁబడి) అతిదీనుఁడను-నేనెంతవాఁడను! మీదాసుఁడను.

రాజు—దేవియు భీమకవియు నేరీ!

రాము—మనకుఁ గావలసినవానిని మనము తెచ్చికొంటిమి నిక్షేపములోనుండి మహారాణి యాభరణములఁ దెప్పించి యలంకృతమైన యాదేవిని- (చూచి) ఇదె. కవీంద్రులు తోడితెచ్చుచున్నారు.)

భీమకవి—(రాణితోఁ బ్రవేశించును)

రాజు } — భీమకవికి నమస్కరింతురు.
రాణి }

భీమ—కళ్యాణమస్తు. రాజా!

ఉ. రాముని యమోఘబాణమది రావణుపైఁబలుమాఱుతప్పెనా
పాములఱేనికాటునుధ్రువంబుగఁదప్పెనుగొన్ని తావులన్
సోమునికంటిమంటయును సూనశరాయువుమీఁదఁదప్పెనీ
భీమునిమాటతప్పెనొకో వేయుసమంబులు రాజ్యమేలుమా.

(అని యక్షతలు పూవులు మీఁదఁ జల్లును.)

రాజు—(శిరసావహించుచున్నాఁడు)

రాణి—(రామునివంకఁ దిరుగుచున్నది.)

రాజు—రామా! నీవు పరమోపకారివి. మనశ్శాంతినొంది నిశ్చింతుఁడై మనవీటనేయుండు నీకవిపండితుని సేవఁజేయుచు సుఖంబున నుండుము. నీకింతటినుండి యేచింతయును లేదు. నీదాస్యము వాపితిని.

భీమ—తథాస్తు.

— భరతవాక్యము. —

" స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేనమార్గేణ మహీంమహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తునిత్యం
లోకాః సమస్తాస్సుఖినోభవంతు.

—అందఱునిష్క్రమించుచున్నారు.

ఇది—కౌండిన్యగోత్రోద్భవుఁడు కొత్తపల్లి రామసార్యుని యాజవపుత్త్రుఁడు, సూర్యరావు రచియించిన కళింగగంగునాటకము నందుఁ బంచమాంకము—సమాప్తము.